# లు అంటే ఏమిటి?

# తెలుగు

పరమాత్మ ఆత్మ జీవాత్మ


రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ.శ్రీ.శ్రీ. ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు



www.thraithashakam.org







# ఓ

# అంటే ఏమిటి?

రచయిత


**త్రిమత ఏకైక గురువు**

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (64) చతుష్షష్ఠాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–37 ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి–2016

ప్రతులు : 1000 **వెల : 45/-**



త్రైత శకం

www.thraithashakam.org

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
03) ధర్మము-అధర్మము.
04) ఇందుత్వమును కాపాడుదాం.
05) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
06) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
07) సత్యాన్వేషి కథ.
08) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
09) శ్రీకృష్ణుడు దేవుడా, భగవంతుడా.
10) గీతా పరిచయము (తె/ఇ).
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు (తె/ఇ/క).
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ.
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) దేవుని గుర్తు-963.
37) మతము-పథము.
38) ఇందువు క్రైస్తవుడా?
39) ఆత్మలింగార్థము.
40) నాస్తికులు-ఆస్తికులు.
41) గుత్తా.
42) ప్రబోధ తరంగాలు.
43) త్రైత సిద్ధాంతము.
44) రూపము మారిన గీత.
45) ద్రావిడ బ్రాహ్మణ.
46) తీర్పు.
47) కర్మ పత్రము.
48) ప్రవక్తలు ఎవరు?
49) ధర్మశాస్త్రము ఏది?
50) వార్తకుడు-వర్తకుడు.
51) దేవుని చిహ్నము.
52) ఏది నిజమైన జ్ఞానము?
53) నిగూఢ తత్త్వార్థ బోధిని.
54) ప్రబోధానందం నాటికలు.
55) మత మార్పిడి దైవద్రోహము.
56) మతాతీత దేవుని మార్గము.
57) హేతువాదము-ప్రతివాదము.
58) నీకు నా లేఖ.
59) జీహాద్ అంటే యుద్ధమా?
60) త్రైతశక పంచాంగము.

త్రైతశకం

61) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
62) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
63) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
64) మరణము తర్వాత జీవితము.
65) ఏ మతములో ఎంత మతద్వేషము?
66) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
67) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
68) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
69) స్వర్గము ఇంద్రలోకమా!-నరకము యమరాజ్యమా!!
70) ఒక మాట మూడు గ్రంథములు.
**71) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**72) మధ్యమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**73) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**74) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు (రెండవ భాగము)**
75) లు అంటే ఏమిటి?



### ఖుదా ఇస్లామిక్ స్పిరిచ్యువల్ సొసైటీ

1. అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు. 2. ఖుర్‌ఆన్‌లో ఆణిముత్యాలు.
3. అంతిమ దైవగ్రంథములో అర్థాలు-అపార్థాలు. 4. జకాత్ (ఆర్థిక సేవ).
5. అంతిమ దైవగ్రంథములో జ్ఞాన రత్నాలు. 6. షరియతా-జ్ఞానమా.
7. అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు. 8. ఖుదా-అల్లాహ్. 9. రెక్కల గుఱ్ఱము.
10. చంద్రుడు-నక్షత్రము.

### సువార్త క్రైస్తవ సంఘం

1. సువార్త బైబిలు. 2. దేవుని మార్గము-మన ప్రయాణము.
3. మత్తయి సువార్త మర్మాలు. 4. మతాలన్నిటికి ప్రాథమిక జ్ఞానము.
5. మత ధిక్కారము కాదు-సత్యగ్రాహితము. 6. పాప క్షమాపణ ఎలా కలదు?

### ద్రావిడ శ్రేష్టి సంఘం

1. సంఖ్య లో అంఖ్య

### రావణ బ్రహ్మ ద్రావిడ బ్రాహ్మణ సంఘం

1. త్రైత సిద్ధాంత పరిశీలన
2. త్రైత సిద్ధాంతం సూపర్ సైన్స్

## 04 యోగీశ్వరుల వారి సంచలనాత్మక, ఆధ్యాత్మిక ప్రసంగములు

*DVD'S*

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము.
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూమహాసముద్రము.
11. సృష్టి-సృష్టికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము.
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు.
40. బయటి సమాజం-
    లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవునిజ్ఞానము-
    మాయమహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము.
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక, ఆధ్యాత్మిక ప్రసంగములు

*DVD'S*

56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు-
    కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము.
63. సహజ మరణం-
    తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము.
65. దేశం మోసం-దేహం మోహం.
66. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
67. జీర్ణ+ఆశయము.
68. మేఘం ఒకభూతం-
    రోగం ఒకభూతం.
69. దేవునికి మతమున్నదా?
70. ఇచ్ఛాధీన కార్యములు-
    అనిచ్ఛాధీన కార్యములు.
71. ఏది ధర్మము.
72. అధర్మ ఆరాధనలు.
73. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
74. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
75. నిదర్శ - నిరూప.
76. నటించే ఆత్మ.
77. సంచిత కర్మ.
78. గురువు ఎవరు?
79. శ్రీకృష్ణుడు ఎవరు?
80. సుఖము-ఆనందము.
81. టక్కుటమారా, ఇంద్రజాల
    మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.
82. భయం.
83. దశ-దిశలు.
84. ఆడించే ఆత్మ.
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
87. ఏది శాస్త్రము?
88. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
89. 6-3=6.
90. గుర్తింపబడనివాడు గురువు.
91. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
92. చంద్రాకారము (బట్టతల).
93. మతములలో పవిత్రయుద్ధము.
94. మూడు గ్రంథములు.
95. ఏడు ఆకాశములు.
96. దైవగ్రంథము
97. జ్ఞానము కబ్జా అయ్యింది.
98. భక్తి-భయము.
99. జ్ఞానశక్తి.
100. కాలజ్ఞాన వాక్యములు.
101. అర్థము-అపార్థము.
102. తోలేవాడు.
103. గురు చిహ్నం.
104. భక్తి-శ్రద్ధలు.
105. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
106. పురుషోత్తమ.
107. మతద్వేషము.
108. నీ వెనుక వాడు.
109. గ్రంథము - బోధ.
110. ఆట - దోబూచులాట.
111. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం,
అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968,
92900 12413, 94406 01136.

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 8185020272.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి,దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
తెలంగాణ రాష్ట్రం, Cell:94910 40963,
90329 63963, 98485 90172.

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా.
Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**వై. రేణుక దేవి** (ఇ.సభ్యులు)
పద్మావతినగర్, తిరుపతి టౌన్,
చిత్తూరు జిల్లా.
Cell : 9491773455, 9032903955.

త్రైత సిద్ధాంతం

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**టి. వీరనారాయణ రెడ్డి** (ప్ర.సభ్యుడు)
బట్టేపాడు గ్రా॥ ఆత్మకూరు మం॥,
నెల్లూరు జిల్లా.
Cell : 9494618322, 8374923363

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు జిల్లా.
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్ర.సభ్యుడు)
నరసరావుపేట, గుంటూరు జిల్లా
Cell : 9989204097, 9849555738

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం జిల్లా.
Cell : 9849883261, 8142853311,
8187084516.

**చెన్న ఆంజనేయులు** (కరెస్పాండెంట్)
జ్ఞానోదయ హైస్కూల్, ఇటిక్యాల,
రాయికల్ మం॥, కరీంనగర్ (జిల్లా)
Cell : 95507 97782, 95538 30871

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు), భీమిలి
(మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**డా॥బి. ధర్మలింగాచారి** (ప్ర.సభ్యుడు)
శ్రీ కనక మహాలక్ష్మి క్లినిక్,
(S కోట), విజయనగరము (జిల్లా).
Cell: 08966-275208, 9704911737

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.



www.thraithashakam.org

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252,
9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505768181

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ,
మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట (మం), మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815,
9440655409, 9701261165.

**యం. మురళి**
క్రొత్త బస్టాండు ప్రక్కన, జడ్చర్ల,
మహబూబ్‌నగర్ జిల్లా.
Cell : 97057 16459

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
సీతానగర్, భువనగిరి టౌన్,
నల్గొండ జిల్లా. Cell : 7680065963
9704885964, 9848141703.

**వి. దుర్గావరప్రసాద్**
భవానీ నగర్, కోదాడ టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9963287001, 9866357001.

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణా ఫార్మా, కాలేజీ రోడ్,
హోస్పేట, బళ్ళారి జిల్లా,
కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

# లు అంటే ఏమిటి?

'లు' అనునది ఒక అక్షరము. 'లు' అను అక్షరము మిగతా భాషలలో యున్నా అది ఒక్క తెలుగుభాషలోనిదేయని చెప్పవచ్చును. వాస్తవానికి తెలుగు భాషలో 'లు' అను ప్రత్యేక అక్షరము లేదనియే చెప్పవచ్చును. తెలుగులో 'ల' అను అక్షరమున్నదిగానీ 'లు' అను అక్షరము లేదు. భాష అనగా భావమును వ్యక్తము చేయునది మాత్రమే. భాషలో అక్షరములుండవచ్చును, ఉండక పోవచ్చును. భాష భావమును తెలుపునదే గానీ లిపితో సంబంధముండవచ్చును, ఉండక పోవచ్చును. భాష, లిపి వేరువేరువయినా భాషకు లిపికి అవినాభావ సంబంధమున్నదనియే చెప్పవచ్చును. ముందు 'భాష' పుట్టుతుంది. తర్వాత 'లిపి' పుట్టుతుంది. భాష పుట్టిన తర్వాత లిపి తయారయిన భాషలు ఎన్నియున్నా, భాష పుట్టిన తర్వాత లిపి తయారుకాకుండా నిలిచిపోయిన భాషలు ఎన్నో గలవు. వాటి వివరమును చూస్తే ఇలా కలదు. మొత్తము ప్రపంచ వ్యాప్తముగా యున్న భాషలు 7,105 కాగా అందులో లిపి యున్నవి 3,570 భాషలున్నట్లు సమాచారము గలదు. లిపి లేని భాషలు 696 గలవు. మిగతా 2839 భాషలు మారుమూల ప్రాంతములలో తక్కువ జనాభా మధ్య గలవు. వాటిలో లిపి గల భాషలు ఇవియని చెప్పలేము. అట్లే లిపి లేని భాషలు ఇవియని కూడా చెప్పలేము. గుర్తులతోనూ, గీతలతోనూ, వస్తువులతోనూ, చింతగింజలు చూపడముతోనూ అనేక విధముల వ్యక్తము చేయునవిగా యుండుట వలన వాటిలో కొన్నిటికి ప్రత్యేకమైన లిపి యుందని చెప్పలేము. అట్లని లిపే లేదని చెప్పుటకు వీలులేని విధముగా యున్నాయి.

ఒకరి నుండి మరొకరికి భావమును పంపడములో అనగా భావ వ్యక్తీకరణలో ముఖ్యమైన పాత్ర పోషించునది భాష అనియే చెప్పవచ్చును. భాష మాట్లాడబడునది, లిపి వ్రాయబడునది. భాషను లిపిచేత వ్రాయ

వచ్చును. అలాగే లిపిని భాష చేత చెప్పవచ్చును. అందువలన భాష, లిపి రెండూ అవినాభావ సంబంధము కల్గియున్నవని చెప్పవచ్చును. ప్రపంచములో మొదట జ్ఞాన భావమును వ్యక్తము చేసినప్పుడు ఏర్పడిన శబ్దమును 'భాష' అని మొట్టమొదట అన్నారు. ప్రపంచము తయారయి నప్పుడు భాష లేదు. శబ్దము లేని సైగలతో భావమును తెలుపుకొనెడివారు. అటువంటి భాషలు నేడు కూడా రెండు వేలకు పైనే యున్నవని చెప్పుచున్నారు. కొన్ని భాషలు లిపిలేనివయినా భావము మాత్రము శబ్దముతోనే యుండుట వలన ఆ శబ్దమును భాష అని అన్నారు.

**ప్రశ్న :- ప్రపంచములో మొట్టమొదట పలుకబడిన భాష పేరేమిటి?**

**జవాబు :-** ఆ దినములలో 'భాష' అను పేరు లేనిదానివలన మొట్టమొదటిది ఫలానా భాషయని చెప్పుటకు వీలులేదు. ఆ దినము మొట్టమొదటిగా ఆకాశభూతము ఏ భావమును వ్యక్తపరచినదో కూడా మనుషులకు తెలియదు. సాధారణ జీవులు అనగా సాధారణ మనుషులు ఎవరుగానీ అంతవరకు శబ్దముతో భావమును వ్యక్తము చేయలేదు.

**ప్రశ్న :- భూమిమీద మనుషులు ఒకరికొకరు మాటలతోగానీ, లేక మాటలను పోలిన శబ్దములతోగానీ ఒకరి విషయమును మరొకరికి తెలుపు కొనుచుందురు. అటువంటప్పుడు మనుషులే మాట్లాడలేదు, కనీసము శబ్దము కూడా చేయలేదు అని మీరంటున్నారు. ఏమీ తెలియని మనుషులకు ఆకాశము తన శబ్దముతో తన భావమును తెలిపితే మనిషి తెలియగలడా?**

**జవాబు :-** ఎవరి భావమును వారు తెలుపుటకు వారికి తెలిసిన విధముగా వారు తమ భావమును వ్యక్తము చేయుదురు. ఎదుటి వ్యక్తి తాము తెలుపు విధానము తెలియునా లేదా అన్నది ఇక్కడ ముఖ్యము కాదు. ఎవరికి

www.thraithashakam.org

తెలిసిన విధానములో వారు తెలుపడమును భాష అంటున్నాము. భావమును తెలుపు విధానము ఎలాగయినా ఉండవచ్చును. ఇలానే ఉండవలెనను నియమము లేదు. ఎదుటివాడు తెలుపు విధానము వినేవాడు తెలిసి యుండవలెనను నియమము లేదు. తెలుగుభాష వచ్చినవానివద్దకు తమిళ భాష వచ్చినవాడు వచ్చి వాని భాషలో వాడు మాట్లాడును. వానికి తెలిసిన విధానము ప్రకారము వాడు మాట్లాడినాడు, అయితే ఎదుటి వ్యక్తి తాను మాట్లాడు తమిళ భాష తెలిసియుండవలెనను నియమము లేదు. ఎదుటివాడు తమిళమును తెలియగలిగితే వానికి తమిళములో చెప్పిన విషయము అర్థమగును. మనము మరొక ఊరిలోగల స్నేహితునివద్దకు పోయినప్పుడు స్నేహితుని ఇంటిముందుగల కుక్క మనలను చూచి మొరిగినదనుకొనుము. అప్పుడు ఆ మొరుగుడులో దాని భావము ప్రకారము మీరు ఎవరో క్రొత్తవారు మా ఇంటికి ఎందుకు వస్తున్నారు? అని అడిగినట్లు ముందే మొరిగినది. ఆ విషయము మనకు అర్థము కాలేదుగానీ, కుక్క మొరిగింది అని మాత్రము తెలుసు.

అలాగే సృష్ట్యాదిలో ఆకాశమునుండి ఒక శబ్దము ఏర్పడినది. అది భావముతో కూడిన మొదటి శబ్దమయిన దానివలన దానిని 'భాష' అన్నాము. ఆ భాష మనకు తెలిసియుండాలి యను నియమము లేదు. వాస్తవముగా కుక్క మొరుగుడులోని భావముగానీ, తమిళ మాటలలోని భావముగానీ మనకు తెలియనట్లే, ఆకాశము చేసిన శబ్దములోని భావము కూడా మనకు తెలియదనియే చెప్పవచ్చును. ఆకాశము చేసిన శబ్దములో భావముండుట వలన, ఆకాశము కూడా ఒక జీవుడే అయివుండుట వలన, అక్కడ ఆకాశము శబ్దరూపములో చెప్పినదానిని, మొట్టమొదట పలుకబడిన భాషగా చెప్పుచున్నాము. ఆ దినములలో భాషలే లేనిదానివలన భాషల పేర్లు

లేవని చెప్పవచ్చును. ఆకాశము పలికిన శబ్దమును భాషగా చెప్పితే, ఆ భాషకు క్రొత్త పేరు పెట్టుకోవలసిందే. ఆ దినము మొట్టమొదటిగా చెప్పిన భావములో ఏమి సమాచారమున్నదో, ఆ సమాచారమునకు సంబంధించిన పేరును పెట్టుకోవడము మంచిదనుకొంటాను. అయితే ఆ దినము ఆకాశము ఫలానా సమాచారమును తెలిపినదని మనిషికి ఏమాత్రము తెలియదు. తర్వాత జరిగిన కాలములో కూడా తెలియదు. ఆ తెలియని తనము కృతయుగము, త్రైతా యుగము, ద్వాపర యుగము చివరి వరకు కొనసాగినది. ద్వాపరయుగము చివరలో శ్రీకృష్ణుడు అర్జునునకు జ్ఞానమును చెప్పినప్పుడు, భగవద్గీతలో జ్ఞానయోగముయందు మొదటి శ్లోకములో **"సృష్ట్యాదిలోనే నేను సూర్యునికి జ్ఞానము చెప్పియుంటిని"** అని అన్నాడు. అయితే అక్కడ కూడా ఆకాశవాణి ద్వారా జ్ఞానమును చెప్పి యుంటినను సమాచారము లేదు. 'తాను మొదటిగా సృష్ట్యాదిలోనే జ్ఞానమును చెప్పాను' అని మాత్రము గలదు. **కలియుగములో మూడు వేల ఆరువందల (3600) సంవత్సరములు గడచిన తర్వాత సూర్యగ్రహము భూమిమీద మనుషులకు జ్ఞానమును తెలియజేసినట్లు, జిబ్రయేల్ అను గ్రహము ముహమ్మద్ ప్రవక్తగారికి, ఆకాశములో సూర్యుని ద్వారా తెలిసిన జ్ఞానమును తెలియజేయడము జరిగినది.** అప్పుడు అంతవరకు తెలియని రహస్యము తెలిసిపోయినది.

సృష్ట్యాదిలో ఆకాశవాణి ద్వారా సూర్యునకు జ్ఞానము తెలిసినదని అర్థమయినది. అయితే ఆ విషయమును జిబ్రయేల్ కూడా అట్లే జరిగినదని చెప్పలేదు. అయితే మహాజ్ఞాని అయిన జిబ్రయేల్ చెప్పిన ఖుర్ఆన్ జ్ఞానములో సూరా 42, ఆయత్ 51నందు చెప్పిన మాటలో కొంత ఆధారము దొరికినది. అక్కడ దేవుడు మనిషికి తెలియజేయు జ్ఞానము మూడు

విధముల ఉండుననీ, అందులో "ఆకాశవాణి ద్వారా ఒక విధముగా జ్ఞానమును తెలియజేతును" అని చెప్పడమైనది. ఐదువేల సంవత్సరము లప్పుడు కృష్ణుడు భగవద్గీతను చెప్పినప్పుడు సృష్ట్యాదిలో సూర్యునకు జ్ఞానమును చెప్పియుంటిని అని చెప్పియుండుట వలన, ఆకాశవాణి ద్వారా చెప్పిన జ్ఞానము సూర్యుడు తెలియుటకు అవకాశముండుట వలన, ఆ విషయమును బాగా శోధించగలిగితే సృష్ట్యాదిలో ఆకాశవాణి సూర్యునకు జ్ఞానము చెప్పినదని తెలిసిపోవుచున్నది. చివరకు కొంత శ్రమయైనా సృష్ట్యాదిలో ఆకాశము తన శబ్దము చేత దైవజ్ఞానమును తెలియచేసినదని అర్థమయిపోయినది. అయితే అప్పుడు ఆకాశవాణి పలికిన శబ్దములోనున్న భావము జ్ఞానమే అయినా, అప్పుడు చెప్పిన భాష ఏమిటి? అను ప్రశ్నకు జవాబును చూస్తే, అప్పటి భాష మొదటిది, క్రొత్తది అయినందున దానికి మనమే ఒక పేరును పెట్టుకొని చెప్పుకోవలసియుండును. ఆ దినము చెప్పబడినది దైవజ్ఞానము అయినందున అప్పటి శబ్దమునకు అనగా భావమును తెలిపిన భాషకు **"దైవభాష"** అని పేరు పెట్టుకొందాము. అలాగే సృష్ట్యాదిలో వచ్చిన భావముతో కూడుకొన్న శబ్దమును 'దైవభాష' అను పేరుతో చెప్పుకోవచ్చును. సృష్ట్యాదిలో మొట్టమొదట పలుకబడిన భాష దైవభాష. సృష్ట్యాదిలో పలుకబడిన దైవభాష ప్రతి సంవత్సరము మనముందర వినిపిస్తూనే యున్నది. దైవభాష ద్వారా ఆకాశము ప్రతి సంవత్సరము మానవులకు అందరికీ దైవజ్ఞానమును తెలుపుచూనే యున్నది. అదే విషయమునే ఖురాన్ గ్రంథములో సూరా 21, ఆయత్ 32లో **"ఆకాశము ద్వారా సూచనలను పంపుచున్నానని"** చెప్పడము జరిగినది. ఆకాశము ద్వారా దేవుడు మనుషులకు చేయు సూచనలనే **'దేవుని జ్ఞానము'** అని అంటున్నాము. దేవుని జ్ఞానమును చెప్పబడిన భాషను దైవ భాష అని చెప్పవచ్చును. అయితే ఆ దైవభాష శబ్దము అందరికీ వినిపించుచుండగా ప్రతి సంవత్సరము అందరము వినగలుగుచున్నాము.

www.thraithashakam.org

**ప్రశ్న :- భూమిమీద ఎన్నో భాషలున్నాయి. వాటికి పేర్లు కూడా ఉన్నాయి. లిపి యున్న భాషలు, లిపిలేని భాషలు అని రెండుగా విభజించి చూచిన దైవభాషకు లిపిలేదు. ఇప్పుడున్న 7105 భాషలలో ఏ భాష దైవ జ్ఞానమునకు దగ్గరగా యున్నది. ఏ భాషను దైవభాషగా చెప్పవచ్చును?**

**జవాబు :-** ఆకాశము చేసిన శబ్దమును గ్రహించిన వాడు సూర్యుడు. సూర్యుడు ఎన్నో సంవత్సరములు తాను తెలిసిన జ్ఞానమును నెమరు వేసుకొని, తర్వాత భూమిమీద మనుషులకు తెలియజేశాడు. ప్రపంచములో మొదట పుట్టిన భాష తెలుగు భాష అయినందున, సూర్యుడు భూమిమీద తన జ్ఞానమును తెలుగు భాషలోనే తెలియజేసియుండుట వలన, తెలుగు భాష దైవజ్ఞానమునకు దగ్గరగా అర్థములను కలిగియుండుట వలన తెలుగు భాషను అన్ని విధములా దైవభాషగా చెప్పవచ్చును.

**ప్రశ్న :- భారతదేశములోనే పుట్టి పెరిగిన సంస్కృత భాషను చాలామంది పండితులు, బ్రాహ్మణులు, కొందరు జ్ఞానులమని ప్రకటించుకొన్నవారు దైవభాషగా చెప్పుచున్నారు. దైవ అర్చనలను సంస్కృత మంత్రములతోనే చేయుచున్నారు. యజ్ఞ యాగములవద్ద సంస్కృత శ్లోకములను, మంత్రముల వలె చెప్పుచున్నారు. వేదములను సంస్కృత భాషలోనే వ్రాసుకొన్నారు. ఎందరో సంస్కృతమును దైవభాషగా చెప్పుచుండగా, మీరు మాత్రము తెలుగు భాషను 'దైవభాష' అని అంటున్నారు. మీ మాటను వేదపండితుల దగ్గర నుండి, గుడిలోని అర్చకుల వరకు ఒప్పుకోరు. వారు సంస్కృతమునే దైవభాష అని అంటారు. దానికి మీరు ఏమి జవాబు చెప్పగలరు?**

**జవాబు :-** "ముందు వచ్చిన చెవులకంటే వెనుక వచ్చిన కొమ్ములు వాడి" అని చెప్పినట్లున్నది మీ ప్రశ్న. వెనుక వచ్చిన కొమ్ములు చెవులకంటే పొడవైనా

www.thraithashakam.org

తర్వాత వాడియైనా, అవి ఆవుకు ఎప్పుడో ఒకప్పుడు మాత్రము పనికి వచ్చును. అయితే ముందు వచ్చిన చెవులు ప్రతిక్షణము శబ్దమును వినునట్లు చేయుచుండును. అతిచిన్న శబ్దమును కూడా వినునట్లు శబ్దము వచ్చు దిక్కుకు చెవును త్రిప్పి శబ్దమును వినిపింపజేయును. నాలుగు దిక్కులకు త్రిప్పు చెవుల ముందర ఒక దిక్కుకు కూడా తిరగని కొమ్ములు గొప్పయనుట ఎట్లుండునో, తెలుగు భాషకంటే వెనుక వచ్చిన సంస్కృతము గొప్పయనుట అట్లే యుండును. తెలుగు భాష ప్రపంచములో మొట్టమొదట పుట్టిన భాషకాగా, సంస్కృతము చాలా వెనుక పుట్టినదని తెలియవలెను. తెలుగు భాషలో యున్నన్ని అక్షరములు మరి ఏ ఇతర భాషలో లేవు. అందువలన ఏ చిన్న శబ్దమునయినా, ఎంత కఠినమైన శబ్దమునయినా తెలుగు భాషలోని లిపి వలన వ్రాయవచ్చును.

భాషకు లిపి భార్యవంటిది. భాషకు తగిన లిపియుండుట భర్తకు తగిన భార్యయున్నట్లేయగును. తెలుగు భాషకు లిపియైన అక్షరములు ఎక్కువగా యుండుట వలన **తెలుగు భర్తయంతటి పురుషుడు గానీ, తెలుగు లిపి భార్యయంతటి స్త్రీగానీ ఎక్కడా లేరని చెప్పవచ్చును.** లిపి లేని భాష పెళ్ళికాని పురుషుడులాంటిది. సంస్కృత భాషకు లిపిలేదు అందువలన సంస్కృత భాష భార్య లేని పురుషుడులాంటిది. సంస్కృతమును వ్రాయుటకు ఇతర భాషలను వాడుకోవలసి వచ్చినది. భాష అన్న తర్వాత అది భావమును తెలుపుటకే ఎక్కువగా ఉపయోగపడవలసి యుండగా, సంస్కృత భాష మాత్రము భావమును తెల్పు సందర్భములలో బహుతక్కువగా వాడబడుచున్నది. అర్చనలందును, పొగడ్తలందును, మంత్ర జపములందును వాడుకొంటున్నారు. అంతేకాక మొదట పుట్టిన తెలుగు భాషలోని పదములను ఎక్కువగా సంస్కృతములో పెట్టుకోవడము జరిగినది. మతము

www.thraithashakam.org

అను పదముగానీ, శ్రీమతులు అను మొదలగు తెలుగు పదములను సంస్కృతములో వాడుకోవడము జరిగినది. పెళ్ళికాని ప్రసాద్ పెళ్ళయిన ప్రతాప్‌కు పోటీయన్నట్లు, లిపియున్న తెలుగు భాషకు లిపిలేని సంస్కృతము భాషను పోటీకి పెట్టడము, తెలుగుకంటే సంస్కృతమే గొప్పయనుట ఒక వింతగాయున్నది. లిపియున్న భాషలు 3570 యుండగా, లిపిలేని భాషలు కేవలము 696 మాత్రమే. ఎరికల, దొక్కల, సుగాలి మొదలగు భాషలకు లిపిలేదు. ఎప్పటికయినా లిపివున్న భాషలకంటే లిపిలేని భాషలు వెనుక పుట్టినవని, చిన్నవని అందరి భావములోయుండగా, అన్నిటికంటే ముందు పుట్టిన తెలుగుకంటే చాలా వెనుక పుట్టిన సంస్కృతమును గొప్పయనుట, ఎక్కువమంది మాట్లాడే తెలుగుకంటే తక్కువమంది వాడే సంస్కృత భాషను గొప్పయనడము తెలివి తక్కువ పనియని చెప్పవచ్చును. అంతేకాక చరిత్ర తెలియనివారే అలా మాట్లాడగలరని చెప్పవచ్చును. ప్రపంచములో దైవజ్ఞానము పలుకబడిన మొదటి భాషగా తెలుగును అన్నిటికంటే గొప్పగా చెప్పవచ్చును. ప్రపంచములో మొదట పుట్టిన భాషగా, ప్రపంచములో అన్నిటికంటే పెద్దదయిన బ్రహ్మవిద్యను చెప్పబడిన భాషగా తెలుగు గొప్పదని చెప్పడమేకాక, ప్రపంచములోని ఎన్నో భాషలలో తెలుగు భాషా బీజములు కనిపించుచున్నవి. తన పదములు అన్ని భాషలలోయుండగా, తనకంటే పెద్ద భాష ఏదీ లేదను భావమును వ్యక్తము చేయుచూ, భాషలన్నిటికీ రాజుగా లేక చక్రవర్తిగా తెలుగు భాషయున్నదని చెప్పవచ్చును.

ఎక్కువ భావమును తక్కువ వ్రాతలో ఇముడ్చుకొను పద్యములు వ్రాయు సౌకర్యము ఒక్క తెలుగు భాషలోయున్నదని నేడు ధైర్యముగా ఏ కవియైనా చెప్పవచ్చును. కవుల గొప్పతనము ఒక్క తెలుగు భాషలోనే బయటికి చాటబడినది. ఆటవెలది, తేటగీతి అను పద్యములలో కవుల

www.thraithashakam.org

ప్రతిభ ప్రకటితముకాగా, సీస పద్యములలో కవుల నైపుణ్యము మెరిసి పోయింది. తెలుగులో కవులు చూపినంత చాకచక్యమును ఇతర భాషలలో చూపుటకు వీలులేదు. శ్లోకము తప్ప పద్యము వ్రాయుటకు పనికిరాని సంస్కృతమును, పద్యమును శ్లోకమును రెండిటినీ వ్రాయగల తెలుగుకంటే గొప్పయనడము ప్రత్యక్ష తప్పుగా కనిపించుచున్నది. అన్ని విధముల సంస్కృత భాషకంటే తెలుగు భాషయే గొప్పయని చెప్పవచ్చును. **భూమండలమునకు శక్తినిచ్చు సూర్యుడు పలుకబడిన భాషగా, ఆత్మజ్ఞానమును, ఆత్మను వర్ణించడములో తెలుగుకు తెలుగే సాటియని చెప్పవచ్చును.**

**ప్రశ్న :- మీరు తెలుగు భాషాభిమానులుగా యున్నారు. అందువలన తెలుగు భాషను అంతగా పొగడుచున్నారు అని అనుకుంటున్నాము.**

**జవాబు :-** ఊరక అనుకుంటే ఏమీ ప్రయోజనముండదు. నేను కూడా ఆధారము లేకుండా ఊరక పొగిడితే నాకు కూడా ఏమీ ప్రయోజనము ఉండదు. నేను అన్నీ విడదీసి చూపుచూ తెలుగు భాష గొప్పదని చెప్పుచుండగా, నన్ను భాషాభిమానని అనడము మీకు తగునేమో ఒకమారు వెనుతిరిగి ఆలోచించుకోండి. ఆధ్యాత్మికమునకు తెలుగులో యున్నంత అర్థము, వివరము వేరే భాషలో ఉందేమో మీరే చెప్పండి! **"ఆత్మ"** అను పదము తెలుగు భాషలోనే పుట్టినది. తెలుగు భాషలోనే సంపూర్ణ అర్థమును ఇచ్చుచున్నది. వాస్తవముగా తెలుగు భాష దైవభాషయే. సృష్ట్యాదిలో ఆకాశము ద్వారా దేవుడు తన జ్ఞానమును మనుషులకు అందించాడు. ఆకాశము మహాభూతమే అయినా ఒక జీవుడే అయినందున "జీవుడు ఏదీ చేయలేడు" అను సూత్రము ప్రకారము ఆకాశము చెప్పినదని మనము అనుకొనినా వాస్తముగా ఆకాశము అక్కడ చెప్పలేదు. ఆకాశ జీవునితో సంబంధపడియున్న ఆత్మయే జ్ఞానమును సూర్యునకు అందించినదని

చెప్పవచ్చును. ఆకాశములో అణిగియున్న ఆత్మ అందించినదే అప్పటి జ్ఞానము అని తెలిసిపోయినది. అప్పుడు సూర్యునకు అందిన జ్ఞానము మూడు యుగముల తర్వాత మూడు దైవగ్రంథములుగా ప్రపంచమున కంతటికీ, ప్రతి ఒక్కరికీ జ్ఞానమయినది. ఇక్కడ జ్ఞాన జిజ్ఞాసులు కొంత ఆలోచించవలసి యున్నది. మూడవ చివరి దైవ గ్రంథమందు మూడవ సూరాలో ఏడవ ఆయత్‌నందు ఇలా చెప్పారు. **(3-7) "దేవుని జ్ఞానము దేవునికి తప్ప మరెవరికీ తెలియదు"** అని చెప్పబడియున్నది. అయితే ప్రథమ దైవగ్రంథమందు నేను సృష్ట్యాదిలో సూర్యునికి జ్ఞానము చెప్పియుంటిని అని స్వయముగా దేవుడే చెప్పినట్లు కలదు. "దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇతరులకు తెలియదు" అని చెప్పడమే కాక "సృష్ట్యాదిలో సూర్యునికి నేనే చెప్పాను" అన్నప్పుడు దేవుడు తప్ప ఎవరూ చెప్పలేదని తెలిసిపోవుచున్నది. ఇంకొక విధముగా చూస్తే దేవుడు ఏదీ చేయువాడు కాదు, ఏదీ చెప్పువాడు కాదు అని చెప్పుటకు దేవుడు రూప, నామ, క్రియలు లేనివాడని తెలిసినది. క్రియ లేనివాడను ధర్మము ప్రకారము చూస్తే దేవుడు ఏమీ చేయలేదు, ఏమీ చెప్పలేదని అర్థమగుచున్నది. దీనిప్రకారమైతే సృష్ట్యాదిలో సూర్యునకు జ్ఞానమును తెలిపి యుంటినను మాట అసత్య మగును. అంతేకాక దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇంకెవరికీ తెలియదు" అనిన దేవుని మాట కూడా అసత్యమగును. ఒకవేళ ఈ మాటలే సత్యమనుకొంటే దేవుడు అన్ని కార్యములు చేసిన వాడగును.

ఒక విధముగా చూస్తే దేవుడు పనులు చేయడని తెలియుచున్నది. మరొక విధముగా చూస్తే దేవుడు పనులు చేయునని తెలియుచున్నది. ఈ రెండిటి మధ్య ఏది సత్యమో, ఏది అసత్యమో అర్థముకాక మనుషులు తలలు పట్టుకోవలసియుండును.

**ప్రశ్న :- మీరు దారి తప్పి ఎక్కడికో పోయి 'దేవుడు సత్యుడో, అసత్యుడో' అని చెప్పుచున్నారు. నేను చెప్పినది మీరు తెలుగు యొక్క భాషాభిమాను లన్నాను. మీరు భాషను గురించి మొదలు పెట్టి వివాదాస్పద విషయము లోనికి పోయారు.**

**జవాబు :-** నన్ను తెలుగు భాషాభిమానులన్నారు. ఆ విషయమై తెలుగు భాష ఎంత గొప్పదో తెలియుటకే ఈ ఉపోద్ఘాతమును చెప్పుచున్నాను. తెలుగు భాష ఒక్కమారు గొప్పదని నేను చెప్పుట వలన, ఎలా గొప్పదను విషయము మీకు తెలియక నన్ను తెలుగు భాషాభిమానులన్నావు. నాకు ఏ భాషమీద అభిమానము లేదు. అయితే తెలుగు భాషను ఎక్కువగా చెప్పుటకు నావద్ద అనేక కారణములు గలవు. వాటిని తెలియపరచుటకే ముందు ఇదంతా చెప్పవలసిన అవసరమైనది. దేవుడు రెండు రకముల చెప్పాడనీ, దేవుడే అసత్యమును చెప్పాడనీ నేను చెప్పుచున్నట్లు నీకు అర్థమయినది. అందువలన నేను వివాదాస్పద మాటలు చెప్పుచున్నట్లు నీకు అర్థమయినది. వాస్తవముగా నేను చెప్పునది వివాదస్పదము కాదు. దేవుడు చెప్పినది చెప్పినట్లు చెప్పుచున్నాను. దేవుడు చెప్పిన మాటలలో అసత్యము ఎక్కడా లేదు. అయితే దేవుడు చెప్పిన జ్ఞానము మనుషులకు అర్థము కాలేదని చెప్పుచున్నాను. దేవుని జ్ఞానము అర్థముకాకపోతే దేవుడు ఒకచోట ఒకరకము, మరొకచోట మరొక రకము చెప్పినట్లు తెలియును. అందువలన దేవుని జ్ఞానమును తెలియుటకు ఎంతో శ్రద్ధ అవసరమని చెప్పుచున్నాను.

దేవుడు చెప్పిన జ్ఞానములో "దేవుడు పని చేయువాడు కాదు" అని యున్నది. అదే దేవుని మాటలలో "నేను ఈ విశ్వమునంతటినీ సృష్టించానని" కలదు. అప్పుడు ముందుమాటకు వెనుక మాట పూర్తి విరుద్ధముగా

యున్నట్లు తెలియుచున్నది. అలా చెప్పవలసిన అవసరమేమి వచ్చినదనీ ఆలోచిస్తే, రెండుమాటలూ నిజమేనని తెలియుచున్నది. దేవుడు చెప్పిన రెండు మాటలు వాస్తవమేనని చెప్పుటకు, ముందు దేవుడు ఎటువంటి వాడో తెలియవలసియున్నది. ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. దేవుడు ఒక్కడే అయినా, ఆయన మొత్తము నాలుగు విధముల విభజింప బడియున్నాడు. అందులో మూడు భాగములను ఒక ప్రక్క, మరొక భాగమును ఒక ప్రక్క నిలిపి ఆట మొదలిడినాడు. జగన్నాటకము అను ఈ ఆటలో దేవుని నుండి విభజింపబడియున్న పరమాత్మ, ఆత్మ, జీవాత్మ మూడూ ఒక ప్రక్క యుండగా, అలాగే ప్రకృతియను ఒక భాగము మరొక ప్రక్క యున్నదని తెలియవలెను. ఇదంతయూ దేవుడు దేవుడుగా యుంటూ తననుండి మిగతా భాగములను దేవుడు విభజించాడని తెలియుచున్నది. ప్రకృతి యనగా కనిపించే ప్రపంచమనీ తెలియవలెను. అయితే జీవాత్మ, ఆత్మ, పరమాత్మ కనిపించకయున్నవనీ చెప్పవచ్చును. **మూడు ఆత్మలను తెలియుటే నిజమైన జ్ఞానము.** ఒక శరీరమును తీసుకొని చూస్తే, కనిపించు శరీరము ప్రకృతితో తయారయినది. కనిపించే ప్రకృతి శరీరములో కనిపించని జీవాత్మ, ఆత్మ, పరమాత్మలు నివశించుచున్నవి. జీవుడు మాత్రము కర్మబద్ధుడై యుండుట వలన అతడు శక్తిహీనుడు. జీవాత్మ ఏమీ చేయలేనిదిగా యుండి, కర్మలో బంధింపబడియుండుట వలన ఆత్మయే జీవున్ని ఆడించుచున్నది. అలాగే శరీరములోని పరమాత్మ ఆత్మకంటే వేరుగాయుండుట వలన, శరీరములో జరుగు పనులకు సాక్షిగాయుంటూ ఏమీ చేయక యున్నది. జీవుడు కర్మ ప్రకారము చేయవలసిన పనులను ఆత్మయే చేస్తూ జీవాత్మ చేయునట్లు జీవుని భావమునుబట్టి లెక్కించుచున్నది. ఇక్కడ "జీవుడు ఏమీ చేయలేడు" అను సూత్రము (ధర్మము) నెరవేరుచున్నది. జీవుడు చేయలేడు, జీవుడు చేయుటకు చేతకానివాడు. అందువలన జీవుని

కార్యముగా నిర్ణయింపబడిన కర్మను ఆత్మయే చైతన్యమై చేయుచున్నది. జీవుడు చేయని పనిని జీవుని భావమును బట్టి జీవుడు చేసినట్లో, చేయనట్లో లెక్కించబడును.

మరొక గమనింపదగిన విషయము ఏమనగా! దేవుడు ఏమయినా చేయగలడు, అయినా చేయడు. జీవుడు చేతకాక చేయడు, దేవుడు చేతనయి కూడా చేయడు. శరీరములో ఏ పనినీ చేయనివారు ఇద్దరు గలరు. వారే జీవాత్మ, పరమాత్మయని చెప్పవచ్చును. అనగా జీవుడు, దేవుడు ఇద్దరూ పని చేయరు. జీవుడు చేయను చేతకాక చేయలేడు. దేవుడు చేయుటకు చేతనయి కూడా చేయకుండాయున్నాడు. అయితే జీవుడు కర్మప్రకారము చేయవలసిన పనులను మధ్యలోయున్న ఆత్మ చేసిపెట్టుచున్నది. మధ్యలో యున్న ఆత్మ అన్ని పనులు చేయుటకు సిద్ధముగాయున్నది. అయినా ఆత్మ చేయుటకు ఏ పనియూ లేదు. అందువలన చేతకాని జీవుని పనిని, చేతనయ్యే దేవుని పనిని ఆత్మ చేయుచున్నది. ఖాళీగాయున్న ఆత్మ ఊరక యుండక ఇటు జీవుని పనిని, అటు దేవుని పనిని రెండిటినీ చేయుచున్నది. పరమాత్మ, జీవాత్మ మధ్యలో ఏ పని లేకుండా ఆత్మ యున్నది. శరీరములో దేవునికి పనియున్నది, జీవునికి కర్మను అనుభవించే పనియున్నది. దేవునికి కర్మ లేదు అయినా జీవుళ్ళకు తన జ్ఞానము తెలిపే పనియున్నది. దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇతరులకు ఎవరికీ తెలియదు. అటువంటప్పుడు దేవుడే తన జ్ఞానమును తెలియ చెప్పవలసిన అవసరమున్నది. దేవునికి ప్రపంచ సంబంధ పని ఏమీ లేదు. ప్రపంచ సంబంధ ప్రతి పనిని ప్రకృతి జనితమైన మాయయే చేయుచున్నది. మనుషులను పుట్టించుట, జీవింప జేయుట, మరణింపజేయుట మొదలగు కార్యములన్నిటినీ ప్రకృతియే చేయుచున్నది. ఇంకా దేవుడు చేయవలసిన జ్ఞాన సంబంధ కార్యములను దేవుని బదులు ఆత్మయే చేయుచున్నది.

www.thraithashakam.org

ఆత్మకు పని లేనిదానివలన తానే చైతన్యమై శరీరములోని దేవుని పనిని జీవుని పనిని చేయుచున్నది. శరీరములోని జీవుడు పనులు చేయలేడు అయినా జరిగెడి పనిని నేనే చేస్తున్నానని తాను చేయకున్నా చెప్పు కొంటున్నాడు. దేవుడు అన్నిటికీ అధిపతియైనందున తన పనిని తనవాడు చేశాడని అనుకొని మౌనముగా యుండును. జీవాత్మ, పరమాత్మల మధ్యలో యున్న ఆత్మ స్వయముగా చైతన్యమైయుండుట వలన, తన ఇష్టమొచ్చి నట్లు ప్రవర్తించి తాను ఏమి చేయాలనుకొన్నా చేయగలడు. ఆత్మ అనగా 'అణిగియున్నది'. ఆత్మ అనగా ఊరకయుండునది కాదు. ఆత్మ అనగా 'అనుక్షణము పనిచేయునది' అని చెప్పబడుచున్నది. ఆత్మకు కర్మలేదు. ఆత్మ అనగా చేసునది, చేయించునది అని రెండు కార్యములు ఏక కాలములో చేయునది. ఆత్మ అనగా! ఎల్లప్పుడూ పరమాత్మతో లంకె వేయబడియున్నది. అనగా ఎల్లప్పుడూ దేవునితో కలిసి కట్టబడినది. ఆత్మ అనగా! ఎల్లప్పుడూ జీవాత్మతో లంకె వేయబడినది. అనగా శాశ్వతముగా జీవాత్మతోపాటు కలిసియుండునది అని భావము కలదు. ఇంకా చెప్పుచూ పోతే ఆత్మ యొక్క నిజస్థితి ఎంతో గలదు. త్రవ్వేకొద్దీ తెలియగలదు. కర్మతోయున్న జీవాత్మను గురించి పూర్తి చెప్పగలము. అణువణువునా వ్యాపించియున్న పరమాత్మను గురించిన జ్ఞానమునకు అంతుగలదు. అయితే శరీరము లన్నిటిలో ఒకే విధముగా, ఒకే ఉద్దేశ్యముతో, ఒకే జ్ఞానముతో యున్న ఆత్మను గురించి పూర్తిగా చెప్పలేము. ఎందుకనగా! జీవాత్మ స్వభావము మరియు పరమాత్మ భావమును రెండిటినీ ఆత్మ ఒకే కాలములో కలిగి యుండును. అందువలన ఇటు పరమాత్మను తెలిసినా, ఆత్మను గురించిన సత్యమును తెలియలేము. అట్లే జీవున్ని (జీవాత్మను) గురించి సంపూర్ణముగా తెలిసినా ఆత్మను గురించిన అసలయిన అనుభవమును తెలియలేము.

www.thraithashakam.org

పరమాత్మ మరియు జీవాత్మతో ఎప్పటికీ కలిసియుండును, కనుక మధ్య ఆత్మను గురించి, రెండు అనుభవములతో కూడిన అనుభవమును గురించి ఎవరూ చెప్పలేరు. భూమిమీద పుట్టిన ఏ జీవాత్మ ఆత్మను గురించి పూర్తిగా చెప్పలేదు.

**ప్రశ్న :- మీరు ఆత్మను గురించి ఎవరూ చెప్పలేరు అని చెప్పుచూనే ఆత్మను గురించిన రహస్యమంతయూ చెప్పుచున్నారు కదా! మీరు చెప్పిన దానితో ఆత్మను గురించిన రహస్యమంతయూ తెలియుచున్నది కదా!**

**జవాబు :-** నేను చెప్పిన దానితో ఆత్మ విషయమంతయూ అర్థమయివుంటే నీవు తిరిగి మాట్లాడలేవు. నిజము చెప్పాలంటే ఆత్మను గురించి సంపూర్ణముగా తెలిసినవారు ఎవరూ మరుక్షణమే శరీరముతో యుండక, శరీరమును వదలి మోక్షమును పొందును. మోక్షమును పొందాలంటే పరమాత్మ జ్ఞానము తెలియాలని కొందరు, దేవున్ని గురించి పూర్తిగా తెలియాలని కొందరు చెప్పుచుందురు. ఇంకా జీవుని కర్మంతయూ అయిపోయిన తర్వాత జీవుడు మోక్షమును పొందునని చెప్పుచుందురు. నాకు తెలిసిన సత్యము తెలిస్తే ఎవరూ ఆ మాటను అనరు. ఎందుకనగా! జీవుని కర్మ పూర్తిగా అయిపోవాలంటే అది జీవుని చేతిలో లేదు. అది అంతయూ ఆత్మచేతిలోనే యున్నది. ఆత్మ తనకు ఇష్టమైతేనే కర్మను పూర్తిగా దహించగలదు. లేకపోతే కర్మను సశేషము చేయుచునేయుండును. శేషము లేకుండా జీవుని లెక్క చేయువాడు ఆత్మయేనని మరువకూడదు. దేవునికి ధర్మమున్నది. అయితే ఆత్మకు ధర్మము అనునదిలేదు. ఆత్మధర్మ మని బ్రహ్మవిద్యా శాస్త్రమును వెదకినా, ఏ పేజీలోనూ ఆత్మ యొక్క ధర్మము కనిపించదు. దేవుని ధర్మములు ఇవియని చెప్పవచ్చును. అయితే ఆత్మ ధర్మమిదియని ప్రపంచములో ఎవడూ చెప్పలేడు. ఎందుకనగా! ఆత్మకు

ధర్మములు లేవు. ఆత్మ ధర్మములకు అతీతముగా యున్నది. అందువలన భగవద్గీతా గ్రంథములో **మోక్ష సన్న్యాస యోగము** అను అధ్యాయమున చివరిలో 61, 62, 63, 64, 65, 66 శ్లోకములను చూచిన ఈ విధముగా గలదు చూండి. 61, 62 శ్లోకముల తర్వాత అనగా 63వ శ్లోకముతో భగవద్గీత పూర్తి అయిపోయినది. అంతవరకు ఆత్మ అణిగి తనను గురించి ఏమాత్రము బయటపడకుండా, భావములో అందరినీ తనవరకు రాకుండా చేసుకొన్నది. అయితే చివరిలో ఉన్న సత్యమును తెలిపి ముగింపు చేసినా, ఎవరి దృష్టి తనపైన పడకుండా అందరి దృష్టిని దేవుడయిన పరమాత్మ మీదికే మళ్ళించినది. ఇప్పుడు ఈ చిన్న గ్రంథమును వ్రాయుచున్న నేను నా స్వయం రచన అయిన **"త్రైత సిద్ధాంత భగవద్గీత"**లో ఆరు శ్లోకముల వివరమును వ్రాశాను. అయితే 61వ శ్లోకములో వ్రాసిన వివరము ఆ దినము నాకు తెలిసి, నేను అక్కడున్న సత్యమును వ్రాయక కొంత దారి తప్పి వ్రాయడమైనది. అలా తెలిసి దారి తప్పించి వ్రాయవలసి వచ్చినది. నేను దారి తప్పి అయినా మీ దృష్టినంతటినీ పరమాత్మ మీదికి ప్రాకునట్లే చేశాను. అక్కడ నేను చేసినది రవ్వంత కూడా తప్పు లేదని అందరికీ తెలియగలదు. ఇక 62వ శ్లోకము యొక్క భావములో కూడా అదే పనిని చేశాను. ఇకపోతే 63వ శ్లోకములో ప్రత్యేకించి చివరిగా "రహస్యములలో కెల్ల రహస్యమైన దానిని చెప్పుచున్నానని" చెప్పి ప్రజల దృష్టిని కొంత దారిలోనికి తెచ్చి చెప్పినట్లయినది. అక్కడ ఆ మాట చెప్పిన తర్వాత వ్రాసే మేము ఎంతో మెలుకువతో వ్రాయవలసి యున్నది. అంతేకాక మిగతా చివరిలో మిగిలిన మూడు శ్లోకములను గురించి చదువువారు ఎంతో జాగ్రత్తగా చదువవలసియున్నది. ఎందుకనగా! చివరిగా రహస్యములలోనే పెద్ద రహస్యమని చెప్పియుండడము వలన భగవద్గీత గ్రంథమును చదివిన శ్రద్ధకంటే ఎక్కువ శ్రద్ధపెట్టి చూడవలసియున్నది. 64వ శ్లోకములో

www.thraithashakam.org

అప్పుడున్న శ్రద్ధకంటే మరింత శ్రద్ధను పెట్టి చూడమని రెండవమారు చెప్పాడు. ఇంతవరకు చెప్పిన సారాంశమును చెప్పుచున్నాను, నీవు నాకు ఇష్టుడవగుట వలన చెప్పుచున్నానని ఇంకా జాగ్రత్త పరచాడు. అంటే చివరిలోని రెండు శ్లోకములు ముఖ్యములలోకెల్లా ముఖ్యమైనవని అర్థమగుచున్నది. అంత ముఖ్యమైన రెండు శ్లోకములను నేను **"త్రైత సిద్ధాంత భగవద్గీత"**లో వ్రాయడము జరిగినది. అయితే 61, 62 శ్లోకములలో అదే పనిగా దారి తప్పించి వ్రాసినట్లు ఇక్కడ వ్రాయలేదు గానీ, 65, 66 శ్లోకములలో కొంతవరకు దారి చూపి చెప్పడమైనది. అయినా పూర్తి సత్యమును అక్కడ రెండు శ్లోకములలో కూడా చెప్పలేదు. ఇదంతయూ నాకు తెలిసి వ్రాసినదేయని ఇప్పుడు కూడా చెప్పుచున్నాను. ముఖ్యముగా చెప్పునదేమనగా! నేను చివరిలో చెప్పిన సారాంశములో ప్రజల దృష్టిని కొంతవరకు సత్యము వైపు మళ్ళించి చెప్పాను. దాదాపు మూడు వంతులు సత్యమును చెప్పానుగానీ, నా ధర్మమును అనుసరించి అదే పనిగా, నాలుగు వంతుల వివరములో దాదాపు మూడువంతుల సత్యమునకు దగ్గరగా తీసుకొని పోయి, ఒకవంతు మాత్రము సత్యమునకు దూరము చేశాను. కొంత రహస్యమును రహస్యముగానే ఉండునట్లు చేశాను.

ప్రశ్న :- **ఇంతవరకు మీరెంతో సత్యవంతులని మీ మాటను అన్ని విధములా ఒప్పుకొను వారిలో నేనూ ఒకడిని. అయితే మీరే స్వయముగా భగవద్గీత చివరిలో ప్రజలను తప్పుదారి పట్టించానని చెప్పడమేకాక, అదే పనిగా తెలిసి తప్పు భావములోనికి పోవునట్లు చేశానని చెప్పారు. మీరు ప్రజలకు భగవద్గీత భావమును తెలియజేయాలను ఉద్దేశ్యముతో భగవద్గీతను 'సిద్ధాంత భగవద్గీత'గా వ్రాశారు. మీరు వ్రాసిన భగవద్గీత ప్రజలు చదివిన తర్వాత ఇంతవరకూ తెలియని జ్ఞాన రహస్యములు ఎన్నో తెలిసాయని సంతోష**

పడుచున్నారు. భూమిమీద ఎవరూ చెప్పని వివరమును మేము తెలియగలిగి జ్ఞానమార్గములో ఎంతో ముందుకు పోయామని సంతోషపడుచున్నాము. ఇంతవరకు ఇతరులకంటే మాకు తెలిసినదే ఎక్కువ అని మేము అనుకొను చుండడగా, జ్ఞానము తెలిసినదని ఎంతో తృప్తిగా యుండగా, భగవద్గీత చివరిలో నేను పూర్తి సత్యమును చెప్పలేదని చెప్పడము మాకు విచిత్రముగా యున్నది. మేము భగవద్గీత చివరిలోని ఆరు శ్లోకములను తిరిగి జాగ్రత్తగా చూడవలసిన అవసరమున్నదని తెలిసినది. అయినా మేము అక్కడ చూచినా! మాకు ఏమి తెలియగలదు? అదే పనిగా మీరు వదలినది మాకు తెలియాలంటే తిరిగి మేము మిమ్ములను ఆశ్రయించి అడుగవలసినదే.

భూమిమీద ఎవరయినా తాను చేసిన గొప్పతనమును చెప్పు కొంటారు గానీ, ఎవరూ తాను చేసిన పొరపాట్లనుగానీ, తప్పులనుగానీ బయటికి చెప్పరు. తాను తెలియక చేసినది తప్పని తర్వాత తెలిసినా దానిని బయటకు రాకుండా జాగ్రత్తపడి చూచుకుంటారు. అయితే మీరు ఏమాత్రము దాచుకోకుండా మీరు చేసిన పొరపాటును చెప్పడము ఒక విధముగా గొప్పతనమేయని చెప్పవచ్చును. అదియూ తెలిసి ప్రజలకు సత్యమును దాచానని చెప్పడము మరీ విచిత్రము. ఇప్పుడు మేము మిమ్ములను అడుగుచున్నది ఏమనగా! మీరు ఆ విధముగా తెలిసి ఎందుకు అలా చేశారు? అక్కడ ఎందుకు అలా చేశారో మాకు తెలియదు. ఇప్పటికయినా మీరు సత్యమును తెలియజేస్తారని కోరుచున్నాము.

**జవాబు :-** మీరు చెప్పినట్లు ఎవరు తప్పు చేసినా తమ తప్పును బయట పెట్టరు. అలా చెప్పితే తమ గౌరవము తగ్గుతుందని చెప్పరు. అయితే అక్కడ నేను తప్పు చేయలేదు. నా ధర్మమును అనుసరించి ప్రవర్తించడము

www.thraithashakam.org

జరిగినది. మీరు నన్ను ఎంత గొప్పగా భావించుకొనినా, నేను కూడా ఒక జీవాత్మనే. నాకు ఆత్మ రహస్యము తెలిసినా, నా ధర్మము ప్రకారము చెప్పకూడదు. ఒకవేళ చెప్పితే నా కర్మంతయూ శేషము లేకుండా పోవును. తర్వాత మీతో మాట్లాడుటకు నేను మీ ముందర ఉండను. కావున నేను భగవద్గీత తర్వాత మీతో ప్రత్యక్షముగా మాట్లాడి చెప్పవలసిన జ్ఞాన సమాచారమును ఎంతో చెప్పాలను ఉద్దేశ్యముతోనే ఆ రోజు అలా చేశానని చెప్పుచున్నాను. అయినా అది నా తప్పుకాదు, నా హద్దును దాటి నేను ప్రవర్తించలేదు. నేను చేసినది నా ధర్మము, కావున అది నా తప్పుకాదని ఈ రోజు సత్యమును చెప్పాను. ఇప్పుడు ఆ రహస్యమును మీరు చెప్పమని అడిగారు. మీరు అడిగినది మంచిదే. అయితే నేను ఇప్పుడు కూడా చెప్పను. అన్నీ నేను చెప్పితే మీరు వెదికేది ఏమున్నది! మీరు కొంతయినా శ్రమించాలి, కావున అక్కడ చివరి రెండు శ్లోకముల వివరమును మీకే వదలి వేయుచున్నాను. మూడు వంతులు చెప్పి ఒక వంతును మాత్రము దాచిపెట్టడము జరిగినది. ఆ ఒక్కవంతు కూడా మీరు తెలియకపోతే మీరు చేసేదేముంటుంది! నేను ఒక జీవుడుగా నావంతు జ్ఞానమును నేను చెప్పడము జరిగినది. ఇప్పటికి కూడా నా హద్దును నేను దాటను. నా ధర్మము ప్రకారము నేను నడువక తప్పదు. అందువలన ఆ చివరి రెండు శ్లోకముల వివరమును మీరే తెలియవలసియుంటుంది.

**ప్రశ్న :- "మీరు జీవుడనని మమ్ములను మభ్యపెట్టి అసలయిన జ్ఞానమును చెప్పకుండా తప్పించుకొంటున్నారు" అని మేము అనుకొంటున్నాము. మిమ్ములను మేము సాధారణ జీవునిగా భావించుకోవడము లేదు. జ్ఞానమును సంపూర్ణముగా చెప్పుటకు భువికి దిగివచ్చిన గురువుగా లెక్కించు కొన్నాము. మీరు తప్ప మాకు జ్ఞాన రహస్యములను చెప్పువారు లేరు. అందువలన**

**దయచేసి భగవద్గీతలోని చివరి ఆరు శ్లోకములకు పూర్తి వివరమును అందిస్తారని కోరుచున్నాము.**

**జవాబు :-** మీరు ఎంత పొగిడినా నేను సాధారణ జీవాత్మనేయని నాకు తెలుసు. నేను జీవాత్మగా ఎన్నో అనుభవములను అనుభవిస్తున్నాను. నా అనుభవములను మీరు చూచినట్లయితే నన్ను జీవాత్మయని మీరే చెప్పగలరు. ప్రపంచ విషయములు నిత్య అనుభవములుగా యున్నాయి. వాటిని వదలి ప్రక్కనబెట్టి జ్ఞానమార్గములో కల్గిన అనుభవములను ఒకటి, రెండు చెప్పెదను వినుము. బహుశా 1998 చివరిలో మరియు 1999 మొదటిలో నేను త్రైత సిద్ధాంతమును ఆధారము చేసుకొని భగవద్గీతను వ్రాయడము జరిగినది. భగవద్గీతను దాదాపు మూడు నెలల కాలము వ్రాయడము జరిగినది. చివరి రోజు భగవద్గీత చివరి శ్లోకములను వ్రాయుచున్నాము. ఆ దినము చివరి ఆరు శ్లోకములు వ్రాయడము జరుగుచున్నది. భగవద్గీత చివరి అధ్యాయము మోక్ష సన్న్యాస యోగము మొత్తము 78 శ్లోకములు గలవు. అయితే మేము వ్రాసిన భగవద్గీతలో చివరి శ్లోకము 66 వ దయినది. చివరిలోని ఆరు శ్లోకములు మూడు భాగములుగా చేసుకొన్నాము. 61, 62 శ్లోకముల లోని భావమును అదే పనిగా దారితప్పించి వ్రాశాము. అందులో సత్యమును సూచాయగా చెప్పి మిగతా భావమును అంతటినీ దేవుని మీదికి అనగా 'పరమాత్మ' మీదికి దృష్ఠి మరల్చి వ్రాశాము. అక్కడ 61, 62 శ్లోకముల వద్ద ఎంతో జాగ్రత్తగా వ్రాయవలసి వచ్చినది. 63, 64 శ్లోకములలో చివరిలో చెప్పు 65, 66 శ్లోకముల ప్రాముఖ్యతను గురించి చెప్పుచూ రహస్యములలోకెల్ల రహస్యమును చెప్పుచున్నానని రెండు శ్లోకముల భావములలో చెప్పడమైనది. చివరి 65, 66 శ్లోకములను వ్రాయుచున్నప్పుడు మూడు వంతులు సత్యము ఒకవంతు అసత్యమును కొలత వేసి చెప్పవలసి

www.thraithashakam.org

వచ్చినది. అప్పుడు హృదయములో సంతోషమో లేక దుఃఖమో చెప్పలేము గానీ ఏదో ఉండేది. అయినా జాగ్రత్తగా ఆ రెండు శ్లోకములకు భావమును చెప్పి భగవద్గీతను ముగించడమైనది. ఎప్పుడయితే భగవద్గీతలోని చివరి రెండు శ్లోకముల భావమును వ్రాయడము అయిపోయినదో, అప్పుడు నేను ఒక జీవున్ని అయినందున ఆపుకోలేకుండా పది నిమిషముల కాలము ఏడ్వడము జరిగినది. ఎందుకు ఏడుస్తున్నామో తెలియదు. ఏదో తెలియని అనుభూతి నన్ను ఏడ్పునకు గురి చేసింది.

జ్ఞాన విషయములో ఆ రోజు ఎలా ఏడ్చానో నాకు బాగా గుర్తున్నది. అప్పటికి భగవద్గీత నాకు ఏడవ రచన అనుకుంటాను. తర్వాత ఇప్పటి వరకు 68 గ్రంథములను వ్రాయడము జరిగినది. ఇప్పటికి ఈ చిన్న గ్రంథముతో మొత్తము 69 గ్రంథములు వ్రాసినట్లగును. ఈ రోజు 15-02-2016 తేదీన సాయంకాలము ఆరు గంటలప్పుడు ఆత్మను గురించి వ్రాయునప్పుడు **"బ్రహ్మవిద్యా శాస్త్రములో ఆత్మ ధర్మములను గురించి వెదకినా ఏ పేజీలో దొరకదు. దేవునికి ధర్మములున్నాయని చెప్పవచ్చును. అయితే ఆత్మకు ధర్మములున్నవని ప్రపంచములో ఎవడూ చెప్పలేడు. ఎందుకనగా! ఆత్మకు ధర్మములు లేవు. ఆత్మ ధర్మములకు అతీతముగా యున్నది"** అని వ్రాయడము జరిగినది. ఈ వాక్యములను వ్రాసిన వెంటనే నాకు తెలియకుండానే నాలో ఏదో అనుభూతి కలిగి వ్రాతను ఆపివేసి దాదాపు పది నిమిషములు ఏడ్వవలసి వచ్చినది. ఏడుపు ఎందుకొస్తున్నదో అప్పటికి తెలియకపోయినా తర్వాత నేను జీవాత్మనే కదా! అందువలన ఏదో ఒక అనుభూతి హృదయములో కలుగును కదా! అందువలన ఏడుపు వచ్చిందిలే! అని అనుకోవడము జరిగినది. 1999వ సంవత్సరము ఏడ్చినది నాకు జ్ఞాపకమునకు వచ్చినది. ఆ రోజు కలిగిన అనుభూతికి నేడు కలిగిన అనుభూతికి ఏమాత్రము తేడా లేదు. అలా

www.thraithashakam.org

జరుగడము దాదాపు పదహారు సంవత్సరముల తర్వాతయని జ్ఞాపకము వచ్చినది. ఇదంతయూ జరిగిన సత్యము అయినందున నేను సాధారణ జీవాత్మనేనని నేను మరచుటకు వీలులేదు కదా! మీరు ఎలా పొగడినా నేను నా కంటే పెద్దవాడిని కాలేను కదా!

**ప్రశ్న :- భగవద్గీతలో మోక్షసన్న్యాస యోగమను అధ్యాయమున చివరిలో గల ఆరు శ్లోకములను ఒకమారు మాకు చెప్పవలెనని కోరుచున్నాము.**

**జవాబు :-** మీరు ఇప్పుడు అడిగినా నేను అప్పుడు చెప్పిన భావమునే చెప్పెదను తప్ప వేరు చెప్పునది ఏమీ ఉండదు. ఇప్పుడు రెండవ మారు చూచుట వలన మీలో శ్రద్ధ ఎక్కువయివుంటే అప్పటికంటే కొంత ఎక్కువ భావమును గ్రహించగలరు. నేను ఇంతగా చెప్పిన తర్వాత మీరు రెండవ మారు మా భావమును చూడుట వలన ఎంతో కొంత మేలు జరుగగలదని అనుకొంటున్నాను.

**భగవద్గీత 18వ అ. 61వ శ్లో॥**

శ్లో॥ ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥
(పరమాత్మ)

**భావము :-** సర్వజీవరాసుల శరీర హృదయములందు పరమాత్మ తిష్ఠవేసి ఉండి, యంత్రమునెక్కి ఆడించువానివలె తన మాయచేత సర్వభూతములను ఆడించుచున్నాడు.

**వివరము :-** సర్వజీవరాసులు అనేక విధములుగా కదలుచూ కొన్ని ఆడుచుండగా, కొన్ని పోట్లాడుచుండగా, కొన్ని రమించుచుండగా, కొన్ని

www.thraithashakam.org

పరుగిడుచుండగా, కొన్ని ఎగురుచూ, కొన్ని దుముకుచున్నవి. అట్లు నానా రకములుగా కనిపించు జీవరాసుల శరీరములలోని హృది స్థానములో పరమాత్మ నివాసముంటున్నాడు. శరీరమంతయూ నాడులచే వ్యాపించి, నాడులచే కదిలింపబడుచున్నది. నాడులకన్నిటికీ కేంద్రము మెదడు. మెదడు నుండి వచ్చు ఆదేశములు నాడుల ద్వారా శరీరమంతయూ ప్రాకి శరీరమును కదిలించి, ఆడించి, పాడించి అనేకములుగా చేయుచున్నవి. మెదడు నుండి ప్రసారమగు ఆదేశము లెక్కడివి? ఎవరివి? అను ప్రశ్న వేసుకొనిన, మెదడు భాగమునే హృదయమనుచున్నాము కదా! హృదయములోనే పరమాత్మ ఉన్నది. కర్మచక్రములోని కర్మానుసారము 'మాయ' అను పరికరములైన బుద్ధి, చిత్తము, మనస్సు ద్వారా ఆదేశము పంపుచూ దాని ప్రకారము నరములను లాగి శరీరమును ఆడునట్లు చేయుచున్నాడు.

యంత్రము మీద పని చేయువాడు యంత్రము మీటలను (స్విచ్‌లను) త్రిప్పుచూ యంత్రముచే పని చేయించినట్లు దేహారూఢుడైన (దేహమునెక్కి ఉన్నవాడైన) పరమాత్మ మొత్తము శరీరమను యంత్రములోని మనో, బుద్ధి, చిత్తములను గుణములతో సరిచేర్చి ఉన్న కర్మప్రకారము ఆడించుచున్నాడు. **పరమాత్మ శరీరమును ఆడించుటకు ఆత్మ యను విద్యుత్తును, మనోబుద్ధి చిత్తములను ముఖ్య అనుబంధ మీటలను, గుణములను చక్రములను, కర్మయను పద్ధతిని ఉపయోగించి కష్ట సుఖములను ఉత్పాదనలను తయారు చేయుచున్నాడు.** ఈ విధానము తెలియనివారు పరమాత్మ శరీరమును నాడులచేత బొమ్మవలె ఆడించుచున్నాడని అనుకోక, అన్నిటికీ తామే కారణమని అజ్ఞానులు తలపోయుచున్నారు. ప్రతి ఒక్కరికీ ప్రతి పని

www.thraithashakam.org

తామే చేసినట్లే అనిపించుచుండును. ఎందుకనగా! బొమ్మలాటలో బొమ్మలను ఆడించువాడు కనిపించక, బొమ్మలు కదలుట మాత్రమే అగుపించునట్లు, మనిషిచేత జరుగుచున్న కార్యములలో లోపల ఆడించు పద్ధతికానీ, ఆడించువాడుకానీ తెలియక, పైకి ఆడేవారు మాత్రము కనిపిస్తుండుట వలన, ప్రతి ఒక్కరూ తమచేత జరుగు పనులను తామే చేయునట్లను కొనుచున్నారు. ప్రతి కదలిక ప్రతి పని నాదికాదు, నేను చేయలేదు, పరమాత్మ, ఆత్మ (బలము) చేత ఇంద్రియములు అనబడు శరీర భాగములను కర్మప్రకారము కదిలించుచున్నాడనీ, తానందుకు కారణము కాదనీ ఎవడు తెలియునో, వాడు అహమును వదలిన వాడగుచున్నాడు. శరీరముతో ఏ పని జరిగినా దానికి తాను కర్తనుకాదని తెలుసుకొను చున్నాడు. దానివలన జరుగు పనులకు వానికి సంబంధము ఏమాత్రము లేదని చెప్పవచ్చును. ఈ సూత్రము ప్రకారము ఒక శరీరము చేత లోకములోని వారందరూ చంపబడినప్పటికీ అందులోని జీవుడు హంతకుడు కాడనీ, వానికి పాపమంటదనీ చెప్పాడు.

**భగవద్గీత 18వ అ. 62వ శ్లో॥**

శ్లో॥ తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత!
తత్ప్రసాదాత్ప రాంశాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥
(పరమాత్మ)

**భావము :-** సర్వ భావములలో పరమాత్మను శరణువేడుము. ఆయన అనుగ్రహము వలన ప్రకృతికంటే అన్యమైన శాంతిని మరియు శాశ్వతమైన మోక్ష స్థానమును పొందవచ్చును.

**వివరము :-** బయటి ప్రపంచములో ఎవడెంత గొప్పదనము, హోదా కల్గి

ఉన్నప్పటికీ, లోపల పరమాత్మ వలననే సర్వమూ జరుగుచున్నవని తెలిసి, అన్నిటికీ మూలకర్తయైన పరమాత్మను తనకున్న అన్ని మనోభావముల ద్వారా శరణువేడి, గొప్పగా తలచుకొని, తనదేమీలేదనీ, ఉన్నదంతా పరమాత్మదేననీ, తాను పరమాత్మ ఆడించునట్లు ఆడు ఆటబొమ్మలాంటి వాడినని తలచి, ఆయనకున్న అనేక అంశలలో ఒక అంశచేతనే సర్వ ప్రపంచమును నడుపగల గొప్పవాడనీ, **"నేను అనుకుంటే నీవు నీవుగానే ఉంటావు, నేను అనుకుంటే నీవు అంతటా ఉంటావు."** అను వాక్యము ప్రకారము ఆయన తలచితే జీవుడు జీవుడుగానే ఉండగలడనీ, ఆయన తలచితే జీవుడు అంతటా అణువణువునా వ్యాపించి పరమాత్మ యందైక్యము కాగలడనీ తెలిసి మ్రొక్కుట వలన, ఆరాధించుట వలన ఎవడైనాకాని పరమాత్మ అనుగ్రహము పొంది, ఆయన ప్రసాదించు శాంతిని పొంది, ప్రకృతికంటే అన్యమైన మోక్షమును (పరమాత్మను) పొందగలడు.

**భగవద్గీత 18వ అ. 63వ శ్లో॥**

శ్లో॥ ఇతితే జ్ఞాన మాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా ।
విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథాకురు ॥

(జ్ఞానము)

**భావము :-** రహస్యములలోకెల్ల అత్యంత రహస్యమైన జ్ఞానమును నీకు నేను చెప్పితిని. దీనిని శేషము లేకుండా వివరించుకొని చూచి ఎట్లు నీకిష్టమో అట్లు చేయుము.

**వివరము :-** ఇంతవరకు భగవంతుని చేత చెప్పబడిన జ్ఞానము చాలా రహస్యమైనది. ఒక విధముగా విప్పి చెప్పినా అర్థముకానిది. పరమాత్మకు తప్ప ఎవరికీ తెలియనిది. పరమాత్మ ద్వారా విన్నప్పటికీ కొందరికి అర్థము

www.thraithashakam.org

కాక రహస్యముగానే ఉండును. కావున రహస్యములలోకెల్ల రహస్యమైనదని చెప్పవచ్చును. ఇంతటి గొప్ప జ్ఞానము తెలియవలెననిన, ఎన్నో జన్మలు జ్ఞానసంబంధ సుకృతముంటేనే సాధ్యమగును. లేకపోతే ఈ జ్ఞానము మీ దగ్గరికే రాదు. ఒకవేళ ఈ వివరములు దగ్గరికొచ్చినా చదువువారే దూరమగుదురు. ఇంత వివరముగా చెప్పబడినదియు హద్దులు గీచి చూపిన గీతను ఎవరైనా వినినా, చదివినా అంతటినీ విశధీకరించి బాగా యోచించి ఎట్లు మీకిష్టమో అట్లే నడుచుకోవచ్చును. భగవంతుడు తెల్పెడి జ్ఞానము నంతటినీ తెల్పి, ఎవరినీ ఇట్లే నడుచుకోమని బలవంతపెట్టక నీ ఇష్టమన్నాడు. జ్ఞానము కర్మాతీతమైనది. జ్ఞానము కర్మనుబట్టి నిర్ణయింపబడి నీకు అంటునది కాదు. జ్ఞానము శ్రద్ధానుసారము లభ్యమగునది. శ్రద్ధ ఎవరి ఇష్టానుసారము వారికి పుట్టునది. స్వయముగా పుట్టునది (స్వయంభూ) శ్రద్ధ అయిన దానివలన నీ ఇష్టమని చెప్పాడు.

భగవంతుడు జ్ఞానము అజ్ఞానము అనియూ, ప్రకృతి పరమాత్మ అనియూ, మాయ ఈశ్వరుడు అనియూ రెండు మార్గములు సూచించి నీవు ఏ మార్గములో పోతావో పొమ్మన్నాడు. ఆయన మన మీదనే బాధ్యత ఉంచినప్పటికీ, నిజ జ్ఞానము తెలిసినవాడు 'నేను' అను అహమును పొందక, నా ఇష్టమని మోహమునబడక, సర్వమూ పరమాత్మయేనని నమ్మి భక్తి నంతయూ ఆయన మీదనే చూపుచూ శరణుపొందిన, ఆయన మరియు ఆయన జ్ఞానము సులభముగా అర్థమగును. అటువంటి శరణ్యము లేకుండా నా బుద్ధిని ఉపయోగించి జ్ఞానము తెలుసుకొంటాననుకోవడము కూడా పొరపాటే. అట్లు పరమాత్మ జ్ఞానము తెలుసుకొనుటకు చాలా కాలము పట్టును. శరణువేడిన వానికి తొందరగా జ్ఞానము లభ్యమగుటయే కాక ఆ జన్మలోనే మోక్షము దొరుకును.

www.thraithashakam.org

**భగవద్గీత 18వ అ. 64వ శ్లో॥**

శ్లో॥ సర్వగుహ్యతమం భూయ శ్శృణు మే పరమం వచః ।
ఇష్టో సిమేదృఢమితి తతో వక్ష్యామి తే హితమ్ ॥
(గీతా సారాంశము)

**భావము :-** సర్వ రహస్యములలో ఉత్తమమగు పరమవచన సముదాయ మును మరల వినము. నీవు నాకు మిగుల ఇష్టుడవగుటచే హితము కోరి చెప్పుచున్నాను.

**వివరము :-** వాస్తవానికి ముందు చెప్పిన 63వ శ్లోకముతోనే భగవద్గీత అయిపోయినప్పటికీ నిజానికి మన హితము కోరి గీత యొక్క సారాంశమును రెండు శ్లోకముల రూపముగా భగవంతుడు చెప్పాడు. వాటికంటే ముందున్న ఈ శ్లోకములో నీవు నాకు ఇష్టుడవనీ, నీ మేలు కోరియని చెప్పడము విశేషము. పరమాత్మ ఎందుకూ పనికిరాని మనలను గొప్పగా గుర్తించి అలా చెప్పాడంటే ఆయనలోని గొప్పతనమేమిటో చెప్పనలవికాదు. ఆయన అంతగా చివరిలో మన మీద శ్రద్ధవుంచి చెప్పిన గీత మొత్తము సారాంశమేదో క్రింద చూచెదము.

**భగవద్గీత 18వ అ. 65వ శ్లో॥**

శ్లో॥ మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోసిమే ॥
(గీతా సారాంశము)

**భావము :-** నన్ను నీ మనుస్సున తలంపుము. నీవు నా భక్తునిగా ఉండుము. నన్నే పూజించుము. నన్నే నమస్కరింపుము. నన్నే పొందగలవు.

ఇది సత్యము. నీవు నాకు మిక్కిలి ప్రియుడవు కాగలవు. ప్రతిజ్ఞ చేసి చెప్పుచున్నాను.

**వివరము :-** ఎవడైతే పరమాత్మను మనసులో తలచుచుండునో, పరమాత్మకు భక్తునిగా ఉంటూ ఆయననే పూజించి, నమస్కరించుచున్నాడో వాడు పరమాత్మనే పొందగలడు. వాడే పరమాత్మకు మిక్కిలి ప్రియుడు. ఆ మాట నిజము. అంత గొప్ప పరమాత్మకు ఇంత చిన్నవాడు ప్రియుడా! అను అనుమానము పెట్టుకోవలసిన అవసరము లేదు. ఎందుకనగా! పరమాత్మయే స్వయముగా ప్రతిజ్ఞ చేసి చెప్పాడు.

పరమాత్మ నిరాకారముగా ఉన్నప్పుడు కానీ, లేక పరమాత్మ సాకార రూపమున ఉన్నప్పుడుకానీ ఆయన మీదే భక్తి, ఆయన మీదే ఆరాధన, ఆయన మీదనే నమస్కారము, ఆయన మీదనే మనోధ్యాస కల్గియుండడమే మహాభాగ్యమగును. వాని పద్ధతే వానిని పరమాత్మునికి ప్రియుని చేసి ఆయన సన్నిధికి చేర్చును. ఇది ఎంతో గొప్ప సారాంశమైన సందేశము.

**భగవద్గీత 18వ అ. 66వ శ్లో॥**

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥
(గీతా సారాంశము)

**భావము :-** సర్వ ధర్మములను సంపూర్ణముగా వీడి నన్ను మాత్రమే నీవు శరణుకోరుము. నిన్ను పాపనియచంబులో నుండి ముక్తుని చేతును. దుఃఖింపకుము.

**వివరము :-** భగవద్గీత అంతయూ ధర్మములు బోధించి, వాటిచేతనే

కర్మయోగము, బ్రహ్మయోగమును సూచించి, ఆ రెండు యోగముల ద్వారా కర్మను నాశనము చేసుకొని మోక్షము పొందమని తెలిపిన భగవంతుడు, గీత మొత్తము సారాంశములో ఇంతవరకు చెప్పిన యోగధర్మములను వీడి నన్నే శరణు పొందమన్నాడు. రెండు యోగ పద్ధతులు పరమాత్మను చేర్చు మార్గములు కాగా, చివరిలో చెప్పిన సారాంశములో **"సూక్ష్మములో మోక్షమని"** చాలా దగ్గర దారిలో పరమాత్మను చేరు ఉపాయమును చెప్పాడు. గీతా సారాంశమైన రెండు శ్లోకములలో ముందు చెప్పినది పరమాత్మ సాకారముగా ఉన్నప్పుడే కాక, నిరాకారముగ ఉన్నప్పుడు కూడా ఆచరించవలసిన భక్తి మార్గమును బోధించగా, ఇక్కడ చివరి మాటగా పరమాత్మ కేవలము సాకారముగా లేక భగవంతునిగ సాధారణ మానవ ఆకారములో ఉన్నప్పుడు, ఏ గుర్తింపులేనివాడై కనుగొనుటకు కష్టమైనపుడు కనుగొన్నప్పటికీ, కొద్దిఅనుమానమున్నా, దానిని పెద్దది చేసి తనకు దూరముగా పంపు సాకారమును అతి కష్టము మీద తెలిసి, **అనుమానము లేని భక్తిగలవారికి** చెప్పిన మాటలని గ్రహించాలి.

సాక్ష్యాత్తూ పరమాత్మ అయిన సాకారమును కనుగొన్నవానికి ధర్మములతో కూడా పనిలేదు. గీత పొడవునా విన్న ధర్మములను కూడా వదలి గీత చివరిలో పరమాత్మను భగవంతునిగా శరణు పొందిన వానిని, ఆయన వాని కర్మనంతటినీ క్షమించి లేకుండా చేసి, తనయందే చేర్చుకొనును. రెండు యోగముల ద్వారా కొన్ని జన్మల వరకు అయిపోని కర్మ, మూడవదైన భక్తియోగముతో ఒకే జన్మలో అయిపోయి ఆ జన్మలోనే పరమ తండ్రి, పరలోక రాజ్యాధిపతి అయిన పరమాత్మను చేరవచ్చును. కర్మయోగము, బ్రహ్మయోగముల ద్వారా కర్మ కాలిపోవలసి వున్నది. కానీ చివరిలో చెప్పిన భక్తియోగములో జ్ఞానాగ్ని లేదు, యోగ సాధన లేదు, యోగి కృషి లేదు.

www.thraithashakam.org

కేవలము శరణు వేడి తన్నుతాను పూర్తి సమర్పించుకొని తాను శూణ్యముగా నిలిచిపోవడమే. అంతమాత్రముననే భయంకర కర్మలన్నీ నిష్ఫలమైపోవును. పరమాత్మయే స్వయంగా కర్మలన్నిటినీ క్షమించివేసి తనవద్దకు చేర్చుకొనును.

**ప్రశ్న :- సృష్ట్యాదిలో ఆకాశవాణి ద్వారా సూర్యుడు జ్ఞానమును విన్నాడని అన్నారు కదా! ఇంతవరకు మీరు చెప్పిన సమాచారము సంపూర్ణముగా సూర్యునికయినా అర్థమయినదా?**

**జవాబు :-** సూర్యుడు గ్రహములలో పెద్ద గ్రహము అయినా ఆయన కూడా ఒక జీవుడే. దేవుడు చెప్పిన జ్ఞానమును అందరికంటే ఎక్కువగా, అందరికంటే బాగా గ్రహించుకొన్నవాడు సూర్యుడే. అయితే భగవద్గీత చివరి ఆరు శ్లోకములను వ్యాసుడు వ్రాశాడు. సూర్యుడు విన్నప్పుడు ఆయనకు తెలిసిన జ్ఞానము భగవద్గీతగా లేదు. సూర్యుడు భూమిమీద చెప్పిన తర్వాత అది భగవద్గీతగా వ్రాయబడినది. సూర్యుడు మొదట జ్ఞానమును విన్న తర్వాత దానిని కొన్ని సంవత్సరములు నెమరు వేసుకొని దేవుడు చెప్పిన జ్ఞానములోని సంపూర్ణ భావమును తెలియగలిగాడు. సూర్యుడు పెద్ద గ్రహము అయినందున ఆయన మొదట అంతా తెలియ కున్నా, కొన్ని సంవత్సరములు నెమరు వేసుకొని చూచుట వలన, ఆయనకు దైవజ్ఞానము సంపూర్ణముగా అర్థమయినది. సూర్యునకు అర్థమయిన తర్వాతనే ఆయన అందరికీ తెలిపాడు. తనతో పాటు ఆకాశములోయున్న అన్ని గ్రహములకు, భూతములకు జ్ఞానమును తెలియజేయడమైనది. అప్పుడే మహాజ్ఞానియైన జిబ్రయేల్ గ్రహము కూడా జ్ఞానమును సంపూర్ణముగా తెలియగలిగింది. కొన్ని సంవత్సరముల తర్వాత భూమిమీద తెలుగు భాషయున్నప్పుడు, సూర్యుడు దక్షిణ భారతదేశమున జ్ఞానమును తెలుపడమైనది. సూర్యుడు తెలిపిన జ్ఞానమునే కృష్ణుడు ద్వాపర యుగమున

అర్జునునికి చెప్పగా, ఆ సమాచారము అంతటినీ వ్యాసునిచే భగవద్గీత గ్రంథముగా వ్రాయబడినది. జిబ్రయేల్ గ్రహము భూమిమీద గల ముహమ్మద్ ప్రవక్తగారికి సూర్యుడు చెప్పిన జ్ఞానమునే చెప్పగా, తర్వాత అదే జ్ఞానమే అంతిమ దైవగ్రంథమయిన ఖుర్ఆన్ గ్రంథముగా తయారైనది.

సూర్యుని వలన సృష్ట్యాదిలో ఆకాశము చెప్పిన జ్ఞానము క్రింద ప్రపంచమంతా వ్యాపించగా, పైన విశ్వాంతరాళము వరకు వ్యాపించినది. సూర్యుడు సంపూర్ణ జ్ఞానమును గ్రహించినవాడై దక్షిణ భారత దేశమున తన జ్ఞానమును మనువు అను వ్యక్తికి చెప్పిపోవడము జరిగినది. అయితే ఆ రోజులలో భూమిమీద ఏర్పడిన భాష ఒకటే ఒకటి. ఆ ఒక్క భాషకు పేరు లేదు. రెండవ భాషయే భూమిమీద లేనప్పుడు అప్పుడున్న భాషకు పేరు పెట్టవలసిన అవసరము ఆనాడు ఏర్పడలేదు. అయితే సూర్యుడు 15 కోట్ల కిలోమీటర్ల దూరమునుండి వచ్చి జ్ఞానమును చెప్పి ఆ భాషకు సూర్యుడే పేరుపెట్టి పోయాడు. సూర్యుడు దేవుని జ్ఞానమును బాగా గ్రహించినవాడు, గనుక తాను మాట్లాడిన భాష పేరు కూడా జ్ఞానముతో కూడుకొని యుండవలెనని తలచినవాడై, జ్ఞానమునకు గుర్తుగా యుండునట్లు పేరును ఉంచడము జరిగినది. నేడు మనము మాట్లాడు భాష తెలుగు భాషయని అందరికీ తెలుసు. అయితే భాషకు **"తెలుగు"** అని పేరు పెట్టిన వాడు సూర్యుడని ఎవరికీ తెలియదు. నేడు సూర్యునకున్న పేర్లన్నీ తెలుగు భాషలోనివే అని తెలియవలెను. సూర్యుడు జ్ఞానమును చెప్పి భాషకు పేరుపెట్టిపోయిన తర్వాత, సూర్యునకు తెలుగు భాషలో పేర్లు పెట్టబడినవి. మొదట భూమి మీద జ్ఞానమును తెలిపినవాడు సూర్యుడే కనుక ఆయనకు 'ఆదిత్యుడు' అని పేరు వచ్చినది. ఆదిత్యుడు అని చెప్పగా తెలుగు భాషలో మొదటి గురువని అర్థము. ప్రపంచములోని

ప్రజల అందరికీ మొదటి గురువు సూర్యుడేయని తెలుపు నిమిత్తము "ఆదిత్యుడు" అను పేరును సూర్యునకు మనువే నామకరణము చేశాడు. తర్వాత చాలా పేర్లు సూర్యునకు తెలుగు భాషలోనే తయారయినవి.

**ప్రశ్న :- ఈనాడు మనము చెప్పుకొను "తెలుగు" అను పదము సూర్యుడు పెట్టిన పేరని ఎవరికీ తెలియదు. భూమిమీద ఇంకాకొన్ని భాషలు వచ్చినప్పుడు వాటికి పేర్లు పెట్టడము జరుగుచుండును కదా! అలా వేరే భాష భూమిమీద తయారయిన తర్వాత మొదటి భాషయిన దానికి తెలుగు అని పేరు పెట్టారని అనుకుంటాను. అలా కాకుండా రెండవ భాషలేనప్పుడే మొదటి భాషకు పేరు పెట్టారా?**

**జవాబు :-** భూమిమీద ఏదీ రెండవ భాషలేనప్పుడే మొదటి భాషయిన దానికి సూర్యుడు తెలుగు భాషయని పేరు చెప్పాడు. ఆదిత్యుని చేత పేరు పెట్టబడిన ఆదిభాష 'తెలుగు'. మొదటి భాషలోనూ సూర్యుడు (ప్రకాశించు వాడు), రవి (కాల్చువాడు), ఆదిత్యుడు (మొదటి గురువు) అయినవాడు, ఆకాశములో నివసించువాడు, దైవజ్ఞానమును మొదట గ్రహించిన వాడు అయిన సూర్యుడు మొదట మాట్లాడిన భాష అయినందున, అది జ్ఞానముతో కూడుకొనియుండు పేరునే సూర్యుడు భాషకు గుర్తుగా పెట్టడము జరిగినది. అయితే కొన్ని యుగముల పర్యంతము పైన సూర్యుడున్నా, క్రింద ఆయన పేరు పెట్టిన భాషయున్నా, సూర్యుడు పెట్టిన పేరిదియని ఎవరికీ ఇంతవరకు తెలియదు. తెలుగు భాషకు పేరుపెట్టిన వాడు సూర్యుడుయని కూడా ఎవరికీ తెలియదు. పేరు పెట్టినవాడు పైన, పేరుపెట్టబడిన భాష క్రింద యున్నా, పేరుపెట్టినవాడు మొదటి గురువయినా, పేరుపెట్టబడిన భాష పెద్ద అర్థముతోయున్నా, ఆదిభాష అయినా, ఇటు భాష విషయముగానీ,

అటు సూర్యుని విషయముగానీ ఏమాత్రము తెలియకుండాపోయినది. ఇప్పుడు పైనగల ఆదిత్యుని గురించి తెలియకపోయినా, క్రిందగల ఆదిభాష అయిన తెలుగు భాషను గురించి తెలుసుకొందాము.

మనిషికి ప్రకృతితో తయారయిన శరీరముండగా, శరీరములో మూడు ఆత్మలు నివసించుచున్నవి. అవియే భగవద్గీతలో **క్షర పురుషుడు, అక్షర పురుషుడు, పురుషోత్తముడు** అని చెప్పబడినాయి. ఇంజీలు గ్రంథములో కుమారుడు, తండ్రి, పరిశుద్ధాత్మయని ముగ్గురుగా చెప్పబడ్డారు. చివరి దైవగ్రంథమయిన ఖుర్ఆన్‌యందు **త్రోలబడేవాడు, త్రోలేవాడు, సాక్షిగా చూస్తూయుండేవాడు** అని ముగ్గురుగా చెప్పబడ్డారు. మూడు దైవగ్రంథములలో మూడు మతముల వారు చదువుచుండినా **ఈ ముగ్గురు దైవజ్ఞానమునకు ముఖ్యమైన సూత్రధారులు** అని తెలియలేక పోయారు. ఆధ్యాత్మిక విద్యయంతా ఈ మూడు ఆత్మల చుట్టూ తిరుగు చుండును. **ప్రపంచములోని జ్ఞానమునకు మూడు ఆత్మలే ఆధారము.** హిందూ మతములో దేవుడు మూడవ పురుషుడుగా చెప్పబడు చున్నాడు. క్రైస్తవములో పరిశుద్ధాత్మయను మూడవ ఆత్మయే దేవునిగా యున్నది. ఇస్లామ్ మతములో అల్లాహ్ అని చెప్పబడు దేవుడు మనుషుల శరీరములోనే సాక్షిగాయున్న వాడేనని వారికి కూడా తెలియదు.

హిందువులయినవారు పరమాత్మయనీ, లేక దేవుడనీ చెప్పబడు మూడవ ఆత్మ (మూడవ పురుషుడు) మానవ శరీరములోనే యున్నాడని తెలియక బయట దేవున్ని వెదకుచున్నారు. నీవు వెదకుచున్న దేవుడు అయిన పరమాత్మ, వెదకుచున్న నీవు ఇద్దరూ శరీరములోనే యున్నారని ఆదిత్యుడు మొదటనే చెప్పియున్నాడు. ఎక్కడయినా ఒకరున్నప్పుడు అతనిని

www.thraithashakam.org

ఏకవచనముగా వాడు, వీడు అని చెప్పుదుము. వారు, వీరు అని అనము. వారు, వీరు అని అంటే బహువచనమగును. మన శరీరములో జీవుడు ఏకవచనముగా అనగా ఒక్కడుగానే ఉన్నానని అజ్ఞానముచేత అనుకోవడము జరుగుచున్నది. వాస్తవముగా జీవుడు ఒక్కడు శరీరములో ఏకముగా లేడు. జీవునితోపాటు ఆత్మ, పరమాత్మ ఇద్దరున్నారు. మొత్తము శరీరములో ముగ్గురు బహువచనముగా చెప్పబడుచున్నారు. ఎక్కడయినా బహు వచనముగా పదము చివర "లు" అను అక్షరమును ఉంచుదుము. 'ఉరుము' అనునది ఏకవచనమగును. 'ఉరుములు' అనునది బహువచన మగును. మొదట ఏకవచనమయిన 'ఉరుము' అను పదమునకు ఒక్క 'లు' అను అక్షరమును కలిపితే అది బహువచనముగా మారిపోవును. గుడ్డ ఏకవచనముకాగా, గుడ్డలు బహువచనమగుచున్నది. అలాగే 'కర్మ' అనునది ఏకవచనము కాగా 'కర్మలు' బహువచనమగును. ఒక్క 'లు' చేరడము వలన బహువచనముగా మారిపోవుచున్నది.

| **ఏకవచనము** | **బహువచనము** | **ఏకవచనము** | **బహువచనము** |
|---|---|---|---|
| ఆత్మ | ఆత్మలు | రోగము | రోగములు |
| యాగము | యాగములు | పశువు | పశువులు |
| శత్రువు | శత్రువులు | పుస్తకము | పుస్తకములు |
| వస్తువు | వస్తువులు | గృహము | గృహములు |
| కుర్చీ | కుర్చీలు | ముస్లీమ్ | ముస్లీమ్‌లు |
| తోక | తోకలు | హిందువు | హిందువులు |
| పాము | పాములు | శరీరము | శరీరములు |
| కాయ | కాయలు | కాగితము | కాగితములు |

www.thraithashakam.org

| | | | |
|---|---|---|---|
| తల | తలలు | కట్టె | కట్టెలు |
| పాపము | పాపములు | పెట్టె | పెట్టెలు |
| తీగ | తీగలు | పుణ్యము | పుణ్యములు |

ఈ విధముగా చెప్పుచూ పోతే ఒక్క **'లు'** అను అక్షరముతో ఏక వచనము బహువచనముగా మారిపోవుచున్నది.

**ప్రశ్న :- ఇంతవరకు తియ్యని జ్ఞానమును చెప్పి, ఇంకా ఎంతో జ్ఞానమును వింటామని మమ్ములను నోరు ఊరించి ఒక్కమారు గొడ్డుకారము పెట్టినట్లు, ఒక్కమారుగా ఎంతో పెద్ద జ్ఞానమును వీడి, క్రిందికి వచ్చి బడిలో చెప్పినట్లు ఏకవచనము, బహువచనములు చెప్పుచున్నారు. ఇప్పుడు మీరు చెప్పిన పదములకంటే ఏకవచనములు, బహువచనములు మాకు ఇంకా ఎక్కువ తెలుసు. ప్రపంచ చదువు వలన మాకు సంతోషము కలుగదు. మాకు కావలసినది ఆత్మజ్ఞానము. ఆత్మజ్ఞానమయిన ఆధ్యాత్మిక విద్యనే చెప్పండి. ప్రపంచ విద్యలలో విసిగియున్నాము. మాకు కావలసినది పరమాత్మ విద్య అయిన బ్రహ్మవిద్యను గురించే చెప్పమని ప్రార్థించుచున్నాము.**

**జవాబు :-** నీకు దైవజ్ఞానము మీద శ్రద్ధయుందో లేదో చూస్తామని ఏక వచనము బహువచనము అని చెప్పాను. నీవు దైవజ్ఞానమే కావాలని కోరుకొంటున్నావు, కావున బ్రహ్మవిద్య అయిన దైవజ్ఞానమునే చెప్పెదను వినుము. నీ శరీరములో నీవు అనబడు జీవాత్మవు నివసించుచున్నావు. నీతో పాటు ఇంకా ఇద్దరుకలరని మూడు దైవగ్రంథములలో చెప్పారు. వారే ఆత్మ, పరమాత్మయని పిలువబడుచున్నారు. దేవుడు సృష్ట్యాదిలో ఒక ప్రకృతిగా, మూడు ఆత్మలుగా విడిపోయాడని చెప్పుకొన్నాము. ప్రకృతి

www.thraithashakam.org

శరీరముగా తయారుకాగా, మూడు ఆత్మలు శరీరములో ఉన్నాయి. అయితే ప్రతి మనిషి జ్ఞానము తెలియనివాడై శరీరములో తాను ఒక్కడేయున్నట్లు అనుకొనును. తనను ఒక్కనిగానే శరీరములోయున్నట్లు అనుకోవడము వలన తాను ఏకవచనములోనికి మారిపోవుచున్నాడు. శరీరములో తాను బహువచనముగా యున్నాననీ, తనతోపాటు ఇంకా ఇద్దరున్నారనీ తెలియ గలిగితే అతడు జ్ఞానియగును. అలా జ్ఞాని అయితే వాని కర్మ గతులు మారిపోవును. ఇదంతయూ బ్రహ్మవిద్యలో యుండే విధానమే. ఏకవచనమును బహువచనముగా మార్చగలుగు సత్తా **"లు"** అను అక్షరము నకు కలదని తెలియునట్లు పైన కొన్ని ఏకవచన పదములకు ఒక్క 'లు' ను కలిపి బహువచనముగా మార్చివేశాము. ఏకవచనమును బహు వచనముగా మార్చగల శక్తిగల 'లు' అను అక్షరమును సూర్యుడు మాట్లాడిన భాషలో యుండునట్లు చేసి ఆ దినమున్న భాషకు **"తెలుగు"** అని పేరు పెట్టాడు. 'తెలుగు' అను మూడు అక్షరములలో ఎంతో జ్ఞాన అర్థముండు నట్లు సూర్యుడు 'తెలుగు' అను పేరును పెట్టాడు.

**ప్రశ్న :- ఏకవచనమును బహువచనముగా మార్చుటకు 'లు' కు శక్తియున్న దని చెప్పారు కదా! పైన మీరు చెప్పిన బహువచన పదములలో 'లు' అను అక్షరము పదము చివరిలో యున్నది. పదము చివరిలో యుంటే ఏదయినా బహువచనము కాగలదు. అయితే 'తెలుగు' అను పేరులో ఏమి గొప్పతన మున్నదో మాకు అర్థము కాలేదు. 'లు' బహువచనముగా ఎవరిని మార్చినదో? మధ్యలో యుంటే బహువచనమెలా అవుతుంది? ఈ 'తెలుగు' అను పదములో ఏమి జ్ఞాన అర్థముగలదో మాకు అర్థమగునట్లు దయచేసి తెలుపగలరని కోరుచున్నాను.**

www.thraithashakam.org

**జవాబు :-** ప్రపంచ విషయములోని పదములకు దైవ విషయములోని పదములకు అర్థము వేరువేరుగా యుండును. దైవికముగా అర్థమును తెలియుటకు ప్రయత్నిస్తే పూర్వము సూర్యుడు తాను తెలిపిన బోధలో దేవుడు మూడు విధముల, మూడు ఆత్మలుగా విభజించాడని తెలియునట్లు, మొదట తాను (సూర్యుడు) మాట్లాడిన భాషకు **"తెలుగు"** అని పేరు పెట్టాడు. 'తెలుగు'లో మూడు అక్షరములు గలవు. అలాగే దేవుని భాగములో మూడు ఆత్మలు గలవు. ఒకటి పరమాత్మ కాగా, రెండవది ఆత్మకాగా, మూడవది జీవాత్మగా యున్నది. జ్ఞానము తెలియని మనుషులకు జీవాత్మ ఒక్కటే తెలియును. పరమాత్మ, ఆత్మ శరీరములోనే యున్నారను విషయము అజ్ఞానులకు తెలియదు. సూర్యుడు చెప్పిన మాట ప్రకారము మనిషి శరీరములో మూడు ఆత్మలు గలవను జ్ఞానమునకు గుర్తుగా, మూడు అక్షరముల పేరును, తాను చెప్పిన భాషకు 'తెలుగు' అను పేరుపెట్టడము జరిగినది. తెలుగు పదము చివరిలో 'గు' అను అక్షరము **జీవాత్మకు** గుర్తుగా గలదు. తెలుగు అను పేరులో మొదటి అక్షరము **'తె'** అనునది **పరమాత్మకు** గుర్తుగా యున్నది. తెలుగు పదములో మధ్య అక్షరము 'లు' అనునది కలదు. అయితే 'లు' అను అక్షరము శరీరములోని **మధ్యాత్మకు** గుర్తుగా ఉంచబడినది. జీవుడు ఒకవైపు దేవుడు మరొకవైపు ఉండగా వారి ఇరువురినీ కలిపి లు అను అక్షరము బహువచనము చేయుచున్నది.

తెలుగు పదములో దేవుడు అను ఏకవచనమును, జీవుడను ఏకవచనమును కలుపుచూ ఆత్మ ఇద్దరితో సంబంధపడియుండి, రెండు ఆత్మలను కలిపి బహువచనము చేయుచున్నది. పరమాత్మకు గుర్తుగా యున్న 'తె' ను, జీవాత్మకు గుర్తుగాయున్న 'గు' ను కలుపు ఆత్మకు గుర్తుగా యున్న "లు" అను అక్షరమును తీసుకొని 'తెలుగు' పదముగా చెప్పారు.

www.thraithashakam.org

**పరమాత్మకు గుర్తు “తె”** అనియూ, **ఆత్మకు గుర్తుగా “లు”** అనియూ, **జీవాత్మకు గుర్తుగా “గు”** అను అక్షరమును చెప్పుచూ మూడింటినీ కలిపి **“తెలుగు”** అని పలుకడములో జ్ఞానము ఇమిడియున్నట్లు సూర్యుడు బాగా ఆ పేరును ఎన్నుకొన్నాడు. శరీరములో ఇటు పరమాత్మ తోనూ, అటు జీవాత్మతోనూ ఆత్మ సంబంధము కల్గియున్నది. రెండు ఆత్మలతో అనుసంధానముగా యున్న ఆత్మ, ఏకముగా యున్న జీవుని, ఏకముగా యున్న దేవున్ని కలిపి మూడు ఆత్మలుగా బహువచనముతో చెప్పునట్లు చేయుచున్నది.

శరీరములో పని చేయలేని జీవాత్మతో కలిసి తోడుగాయుండి జీవుని పనినంతటినీ ఆత్మే చేయుచున్నది. అలా చేయడమును ఆత్మ చాలా గోప్యముగా పెట్టుచూ తాను ఏమీ చేయనట్లుండుట వలన జరిగెడి పనిని జీవాత్మయే చేసినది అని అందరూ అనుకోవడము జరుగుచున్నది. శరీరములో ఆత్మ జీవుని పనిని చేసినా, అది జీవునికి కూడా తెలియని దానివలన జీవుడు కూడా జరిగిన పనిని తానే చేశానని అనుకొంటున్నాడు. ఆత్మ శరీరములో అణిగి యుండి ఎవరికీ తెలియని దానివలన, ఆత్మను ఎవరూ గుర్తించలేక పోవడమేకాక, ఆత్మ పనిని కూడా ఎవరూ గుర్తించలేక పోవుచున్నారు. సూర్యుడు దైవజ్ఞానమును తెలియజేసినప్పుడు, ఆత్మను ఎవరికీ తెలియనట్లు, శరీరములోని జీవునికి కూడా తెలియనట్లు, జీవునికి దేవునికి మధ్యలో తెలియకుండాయుండునట్లు చేశాడు. ఆత్మ అటు దేవునితోనూ ఇటు జీవునితోనూ రెండువైపులా రెండు ఆత్మలతో కలిసియున్నదని తెలియుటకు రెండు కొమ్ములున్న “లు” అను అక్షరమును ‘తె’ కు, ‘గు’ కు మధ్యలో సూర్యుడు వుంచి ‘తెలుగు’ అని చెప్పాడు. ‘లు’ కు రెండు చేతులులాగా రెండు కొమ్ములు ఉండుట వలన, ఒక చేతితో

పరమాత్మను, ఒక చేతితో జీవాత్మను పట్టుకొని యుండు మూడక్షరముల 'తెలుగు' పదమును క్రిందగల పటములో చూడవచ్చును.




ఇప్పుడు 'లు' అంటే ఏమిటి? అను ప్రశ్నకు **'లు'** అంటే **"ఆత్మ"**యని తెలిసినది. ఇక్కడ 'తెలుగు' అను మూడక్షరముల పేరును మొదటి భాషకు నామకరణము సూర్యుడు చేశాడు. మూడు ఆత్మలకు గుర్తుగా 'తెలుగు' అను మూడు అక్షరములను గుర్తించి చెప్పడమైనది. పైన గల చిత్రపటమును చూచిన తర్వాత 'తె' అను పరమాత్మతో 'లు' అను ఆత్మ కొంత కలిసియున్నట్లు తెలియడమే కాక, ప్రక్కనే గల జీవాత్మతో అంటీ అంటక ప్రక్కనేయున్నట్లు తెలియుచున్నది. పరమాత్మలో కొంత తగులుకొనియున్న ఆత్మ జీవాత్మతో పూర్తి అంటుకోక జీవాత్మ ప్రక్కనే యున్నదని తెలిసినది. పరమాత్మకు, జీవాత్మకు మధ్యలో ఆత్మయుండుట వలన ఆత్మను మధ్యాత్మయని కూడా అనవచ్చును. పరమాత్మకు, జీవాత్మకు అంటుకొనీ అంటుకోక దగ్గరగా యుండుట వలన, మధ్యాత్మను అనుసంధాన ఆత్మయని అనవచ్చును. ఆత్మను మూడు దైవగ్రంథములలో చెప్పియున్నా, ఆత్మయను పేరుతో

ఎవరూ చెప్పకుండా ఆత్మ మాయ చేసినది. ఆత్మయొక్క అసలు సిసలు పేరు 'ఆత్మ' అయినా 'మధ్య దైవగ్రంథములో తండ్రియని' చెప్పబడినది. 'చివరి దైవ గ్రంథములో త్రోలేవాడనీ, దూతయనీ' చెప్పబడినది. 'ప్రథమ దైవగ్రంథములో ఆత్మను ఆత్మనియే' చెప్పారు, అయినా ఎవరూ ఆత్మను ఆత్మగా కాకుండా అటు పరమాత్మగానో, ఇటు జీవాత్మగానో లెక్కించారు తప్ప మధ్య ఆత్మగా ఎవరూ గుర్తించలేదు.

భగవద్గీతలో ఆత్మను గురించి అనేకమార్లు చెప్పడము జరిగినది. ప్రథమ దైవగ్రంథమయిన భగవద్గీతలో ఆత్మయొక్క సమాచారమును అనగా ఆత్మను గురించి, ఆత్మయను పదమును ఉపయోగించి చెప్పినది మొత్తము పదహారుమార్లు గలదు. సాంఖ్యయోగములో 55వ, మరియు 64వ శ్లోకములలోనూ, కర్మయోగములో 17వ శ్లోకములోనూ, జ్ఞానయోగములో 27వ మరియు 41వ శ్లోకములలోనూ, ఆత్మసంయమ యోగములో 5, 10, 18, 25, 26, 32వ శ్లోకములలోనూ, రాజవిద్యా రాజగుహ్యా యోగములో 34వ శ్లోకములో, విశ్వరూప సందర్శన యోగమున 3వ శ్లోకములో, దైవాసుర సంపద్విభాగ యోగమున 17వ శ్లోకములోనూ, మోక్ష సన్న్యాస యోగమున 16, 37వ శ్లోకములలోనూ ఆత్మయను పేరును చెప్పడమైనది. మొత్తము పదహారుమార్లు ఆత్మయను పదము వచ్చినా, (చెప్పినా) అక్కడ ఆత్మను ఆత్మగా ఎవరూ గుర్తించలేదు. ఆత్మను జీవాత్మ అనియో, ఆత్మను పరమాత్మ అనియో గుర్తించగలిగారు, అదే వ్రాసుకొన్నారు. చాలా సందర్భములలో ఆత్మను మనస్సుగా కూడా చెప్పుకొన్నారు. మూడు దైవ గ్రంథములలో ఆత్మయొక్క ప్రస్థావన వచ్చినా, అక్కడ ఆత్మను వేరుగా తలచుకోవడము జరిగినది, అలాగే జరుగుచున్నది. అందువలన దేవుడు ఆత్మను గురించి తెలిపినా, మనిషి తెలుసుకొనే స్థితిలో లేడు. అందువలన

www.thraithashakam.org

భూమిమీద ఇంతవరకు ఆత్మనునది ప్రత్యేకముగా ఒకటున్నదని ఎవరికీ తెలియకుండా పోయినది.

ఆత్మ శరీరములో రాజుగా యున్నది. ఆత్మ శరీరములో చైతన్య శక్తిగాయుంటూ ఎవరికీ తెలియకుండా యున్నదనియే చెప్పవచ్చును. ఆత్మ శరీరములో బయట ఎవరికీ తెలియక అణిగియున్నది. జీవ శరీరములు ఎక్కడున్నవో అక్కడంతా ఆత్మ, పరమాత్మ రెండూ గలవు. 'తెలుగు' అను పదములో 'తె' కు అతుక్కొని 'గు' కు ఆనుకొని 'లు' యున్నట్లు, ఆత్మ పరమాత్మతో పూర్తి సంబంధపడియున్నదని తెలియుచున్నది. అంతేకాక **ఆత్మ జీవాత్మకు దగ్గరగాయుండి జీవుని భావమును ప్రతి క్షణము తెలియుచున్నది.** 'తెలుగు' అను మూడక్షరముల చిత్రపటములో మధ్యలో యున్న 'లు' అను ఆత్మ, పరమాత్మయను 'తె' అను అక్షరముతో అంటుకొని యున్నట్లు చూపాము. అట్లు చూపడము వలన మధ్యలోయున్న ఆత్మ పరమాత్మతో కలిసియున్నదని తెలియగలదు. ఒకవైపు 'తె' అను అక్షరముతో కలిసియున్న 'లు' మరొకవైపు 'గు' అను జీవాత్మకు దగ్గరగాయున్నట్లు 'గు' కు ప్రక్కగాయున్నట్లు తెలియుచున్నది. దానివలన పరమాత్మతో ఆత్మ అంటుకొని, జీవాత్మతో ఆనుకొని యున్నదని తెలియుచున్నది. అంటుకొని, ఆనుకొని ఆత్మయున్నదని తెలియునట్లు, ఎవరితో అంటుకొనియున్నదో, ఎవరితో ఆనుకొనియున్నదో తెలియునట్లు 'తెలుగు' అను మూడక్షరముల చిత్రపటమును మీకు చూపడము జరిగినది.

సృష్టి తయారయిన తర్వాత మొదట తయారయిన భాష తెలుగు భాష. అయినా ఆనాడు భాషకు పేరులేకుండాయుండెడిది. భాష తయారయిన కొంతకాలమునకు ఆకాశ గ్రహమైన సూర్యుడు భూమిమీదికి వచ్చి, మనువు అను మనిషికి తెలిసిన భాషలోనే మాట్లాడి జ్ఞానము

www.thraithashakam.org

చెప్పడమైనది. ఆదిత్యుడయిన సూర్యుడు ఆదిలో మొదటిగా మాట్లాడిన భాషకు సూర్యుడే పేరుపెట్టిపోయాడు. భూమిమీద జ్ఞానము తెలిపిన తొలి భాషగా భవిష్యత్తులో అందరికీ తెలియులాగా యుండునట్లు మరియు తెలిపిన జ్ఞానములో మూడు ఆత్మల విషయమే ముఖ్యముగా కలదని తెలియునట్లు, 'తెలుగు' అను మూడక్షరముల పేరును ఆదిత్యుడు పెట్టడము జరిగినది. అంతేకాక అంతవరకు తెలుగు భాషకు లేని లిపిని సూర్యుడే సూచించి పోయాడు. సూర్యుడు సూచనప్రాయముగా మొదట తెలియ జేసినది 'ఓం' అను అక్షరమును. సూర్యుడు మొదట తెలియజేసిన 'ఓం' ను లిపితో తెలుగు లిపియంతయూ వ్రాయబడినది. మొదట వ్రాసిన అక్షరమును అప్పటినుండి ఇప్పటివరకు మొదటి అక్షరముగా చెప్పుకొను చున్నాము. దానినే **'ప్రణవాక్షరము'** అని అంటున్నాము. ప్రణవాక్షరము అనగా "మొదట పుట్టిన ముఖ్యమైన అక్షరము" అని చెప్పవచ్చును.

**ప్రశ్న :- మీరు మొదట పుట్టిన భాషకే 'తెలుగు' అని పేరు పెట్టారని అంటున్నారు. ఇప్పుడు ప్రపంచములో గల 7105 భాషలలో తెలుగు భాషయే మొదట పుట్టినదనుటకు ఆధారముగానీ, సాక్ష్యముగానీ ఏదయినా ఉన్నదా? మీ మాటను మేము నమ్మగలముగానీ, ఇతరులు నమ్మరు కదా! వారు ప్రశ్నిస్తే మేము ఏమి చెప్పవలెను? మీరు చెప్పారంటే అది నూటికి నూరుపాళ్ళు నిజమైయుంటుంది. అయినా మా అజ్ఞానము కొలది మేము ప్రశ్నించుచున్నాము. దయచేసి తెలుపవలెనని కోరుచున్నాము.**

**జవాబు :-** మొదటి భాష తెలుగు అనుటకు 'తెలుగు' అను మూడక్షరములే సాక్షిగాయున్నాయి. 'తెలుగు' అను మూడు గుర్తులు మూడు ఆత్మలకు సాక్ష్యముగాయున్నాయి. సూర్యుడు 'తెలుగు' అను మూడు శబ్దములను మూడక్షరములని చెప్పాడు. అంతవరకు మాట్లాడుచున్న భాషకు పేరులేదు.

www.thraithashakam.org

అట్లే లిపియూ లేదు. మొదట సూర్యుడు మాట్లాడిన భాష సూర్యుని చేతనే తెలుగు అను మూడు ప్రత్యేకమయిన శబ్దములతో కూడిన పేరుపెట్టాడు. అప్పుడే తెలుగు భాషకి లిపిని సూచించి 'ఓం' అని ప్రారంభించి పోయాడు. సూర్యుడు మొదట ప్రారంభించిన 'ఓం' శబ్దమును లిపిగా చెప్పినవాడు సూర్యుడే. అందువలన ఆ విషయము మరువనట్లు ఎక్కడయినా ముందు 'ఓం' ను వ్రాయుట హిందువులకు పరిపాటిగాయుండెడిది. ప్రతి మాట ముందర, ప్రతి మంత్రము ముందర 'ఓం' శబ్దమును ఉచ్ఛరించుట ఉండెడిది. ఈ మధ్యకాలములో మాటల ముందర 'ఓం' శబ్దము పోయినది. కేవలము మంత్రముల ముందర మాత్రమే 'ఓం' శబ్దమును ఉచ్ఛరించడము గానీ, వ్రాయడముగానీ జరుగుచున్నది. మా మాట నిజమని తెలియుటకు 'ఓం' ప్రణవాక్షరముగా నేటికీ మిగిలియున్నది. అంతేకాక తెలుగు శబ్దములోని మూడు గుర్తులకు, అనగా తెలుగు శబ్దమునకు లిఖించిన లిపిని కేవలము లిపి అని అనకుండా లిపికి ప్రత్యేకమయిన పేరుపెట్టడము జరిగినది. లిపి లిఖించవచ్చును. లిఖించిన సమాచారమును 'లేఖ' అనడము జరుగుచున్నది. అయితే భాషకు 'తెలుగు' అను పేరుపెట్టిన సూర్యుడు లిపికి 'అక్షరము' అని కూడా పేరుపెట్టాడు.

దేవుడు సృష్ఠిని తయారు చేయకముందే సృష్ఠికొరకు ముందు తనను నాలుగు విధములుగా విభజించుకొన్నాడు. ముందు తననుండి ప్రకృతిని బయటకు తీశాడు. తర్వాత తనను మూడు రకములుగా విభజించాడు. ఆ విధముగా విభజింపబడిన మూడును ఒకదానిని పరమాత్మయనీ, రెండవ దానిని ఆత్మయనీ, మూడవ దానిని జీవాత్మయనీ చెప్పడమైనది. మూడు ఆత్మలను ఒకవైపు, ప్రకృతిని ఒకవైపు రెండు విధములుగా చేశాడు. ప్రకృతి మార్పుచెందునదిగా, నాశనమగునదిగా

చెప్పాడు. మూడు ఆత్మలను నాశనము లేనివని చెప్పాడు. క్షరము అనగా 'నాశనము' అని అర్థము. ప్రకృతితో తయారయిన శరీరము నాశనమగునది కావున దానిని 'క్షరము' అని అన్నారు. ఆత్మలు ప్రకృతికంటే భిన్నముగా యుండి నాశనము లేనివిగాయుండుట వలన ఆత్మలను 'అక్షరములు' అని అన్నాడు. పరమాత్మ, ఆత్మ, జీవాత్మ మూడు ఆత్మలు నాశనము లేనివగుట వలన వాటిని 'అక్షరములు' అని అనడము జరుగుచున్నది. అక్షరములు అనగా నాశనముకానివని అర్థము ఉండుట తెలిసిన విషయమే కదా! సూర్యుడు తెలుగు అని భాషకు పేరుపెట్టి లిపిని చూపినప్పుడు, తెలుగు అను మూడు శబ్దములు మూడు ఆత్మలకు గుర్తుగా ఉన్నాయి కావున, ఆత్మలు నాశనము కావని తెలియునట్లు 'తెలుగు' అను మూడు శబ్దముల లిపిని, మూడు అక్షరములు అని చెప్పాడు. అప్పటినుండి లిపికి 'అక్షరములు' అను పేరు వచ్చినది. ఆ దినము జ్ఞానసంబంధముగా పెట్టిన పేరు నేటికీ భాషకు తెలుగుయనీ, లిపికి అక్షరములనీ చెప్పడము చూస్తూనేయున్నాము. నేను చెప్పిన విధముగానే భాషకు మరియు భాషకు గల లిపికి పేరుపెట్టడమైనది. భాషకు తెలుగు అని చెప్పడములో పరమాత్మ, ఆత్మ, జీవాత్మయను భావము గలదు. **తె-పరమాత్మ, లు-ఆత్మ, గు-జీవాత్మ**యని నిర్ణయించి చెప్పడమైనది. తెలుగు భాషకుగల లిపిని ప్రత్యేకముగా అక్షరములని జ్ఞాన సంబంధ, ఆత్మ సంబంధమైన పేరుపెట్టాడు. దీనితో తెలుగు, అక్షరములు అను మాట స్థిరస్థాయిగా నిలిచిపోయినది. తెలుగు అక్షరములను విడదీసి చెప్పితే, 'తెలుగు' భాష, 'అక్షరములు' లిపి యగును. నేడు అనేక భాషలున్నవి. వాటిలో కొన్నిటికి లిపియున్నది. అయినా ఆ భాష పేర్లలో అర్థము లేదు. అట్లే భాషయొక్క లిపిలో కూడా అర్థము లేదు. భాషకు అర్థము, మరియు భాషయొక్క లిపికి అర్థము ఒక్క

తెలుగు భాషకే కలదనీ, **తెలుగు భాష "జ్ఞానచిహ్నాము"**గా భూమి మీద తయారయినదనీ, ఆ విషయము ఇంతవరకు ఎవరికీ తెలియదని చెప్పుచున్నాము.

**ప్రశ్న :- ఎవరికీ తెలియదని మీరు చెప్పినప్పుడు అందరిలో మీరు కూడా ఒక్కరు కదా! మీకెలా తెలిసినది?**

**జవాబు :-** అందరిలో నేను ఒక్కడినే! అయితే నేను ఒక్కడిని అందరివలె 'గు' గా లేను, 'తె' గా కూడా లేను. 'లు' కు దగ్గరగా అనగా ఆనుకొని యుండుట వలన 'లు' యొక్క శక్తి నాకు కొంతవచ్చి మీకు తెలియనిది నేను చెప్పుచున్నానని మీరు అనుకోవచ్చును కదా! నేను దేవునితో అంటుకొనిలేను, ఆత్మతో ఆనుకొనియున్నాను, అనగా దగ్గరగా యున్నాను. నా ప్రక్కనే ఆత్మ యుండుట వలన, ఆత్మకు తెలిసిన రహస్యమును నేను కొంత అడిగి తెలుసుకొని మీకు చెప్పుచున్నాను అని మీరు అనుకోవచ్చును కదా!

**ప్రశ్న :- శరీరములో మీరున్నారు, ఆత్మయున్నది. మీరు ఎట్లున్నారో మేము శరీరములో అట్లేయున్నాము. మేము కూడా ఆత్మప్రక్కనే యున్నాము కదా! మేము అడిగితే చెప్పని ఆత్మ మీరు అడిగితే చెప్పడమేమిటి?**

**జవాబు :-** నీ ప్రక్కన ఆత్మ, ఆత్మ ప్రక్కన నీవు ఉండుట వాస్తవమే! అయితే ఆత్మ యుందని నీకు ఇంతవరకూ తెలియదు. ఇప్పుడిప్పుడే మేము చెప్పడము వలన తెలిసింది. అయితే నీవు ఆత్మ విషయమును పూర్తి తెలియకముందే అడుగుచున్నావు. ఆత్మ సులభముగా ఎవరికీ అర్థమవునది కాదు. ఇప్పుడు నీవు అడిగినా ఆత్మవైపు తిరిగి అడుగలేదు. ఆత్మ నీ వెనుకవైపు వుంటే ముందువైపు అడుగుచున్నావు. అట్లే ఆత్మ నీముందువైపు

ఉన్నప్పుడు వెను తిరిగి వెనుకవైపు అడుగుచున్నావు. అందువలన నీకు ఆత్మ ఏమీ చెప్పలేదు.

ప్రపంచములో ఇంతవరకు ఎవరికీ తెలియనిది ఆత్మ. ఆత్మను తెలియుటకు బ్రహ్మవిద్యను ఎంతో నేర్వవలసియున్నది. ఆత్మను గురించి తెలియుముందు ఇటు పరమాత్మ జ్ఞానమును, అటు జీవాత్మ విషయమును పూర్తిగా తెలియవలసియున్నది. మీకు సంపూర్ణముగా ఆత్మను గురించి తెలియాలంటే మూడు దైవగ్రంథములను అసూయ లేకుండా **భక్తిశ్రద్ధలతో** చదువవలసియుంటుంది. నా మతము, నీ మతము అను దురభిప్రాయములను పెట్టుకోకుండా, మొట్టమొదట సూర్యుడు భూమిమీద చెప్పిన జ్ఞానమే మూడు గ్రంథములలో యున్నదను సత్యము తెలిసి మూడు గ్రంథములలోని జ్ఞానమును తెలియండి. అప్పుడు ఆత్మ చేయు వింతలు, విశేషములు అన్నియూ తెలియగలవు. ఆత్మ ప్రక్కనేయున్నా మనకు తెలియకుండా చేస్తున్నదంటే అది వింత కాదా! ప్రపంచములో ఎంతో మేథావిగా యున్నవాడు ఆత్మ విషయములో పూర్తి అజ్ఞానిగా యున్నాడంటే, ఆత్మ వానిని మాయచేసి వాని చూపును తనవైపు లేకుండా చేయడము వింతకాదా! ఇట్లు ఆత్మ మనుషలను అనేక రకములుగా స్వయముగా నడుపుచూ ఎవరికీ తెలియకుండా, ఏమీ చేయనట్లుండడము విశేషము కాదా! మీకు ఆత్మ విషయము బాగా అర్థమగుటకు ఆత్మను గురించిన కొంత సమాచారమును క్రింద చూడండి.

01. సమస్త జీవరాసులందు కలిసియున్నది ఆత్మ!
02. అఖిల జీవులందు ఒకే చైతన్యముగనున్నది ఆత్మ!
03. గాలిలో గంధము కలిసి కనిపించనట్లు, శరీరములో కంటికి కనిపించక ఉన్నది ఆత్మ!

www.thraithashakam.org

04. సాక్షియై అన్ని శరీరములందున్న అందరిలో ఉన్నది ఆత్మ!
05. శక్తిరూపములో శరీరమంతయూ వ్యాపించియున్నది ఆత్మ!
06. సమస్త జీవులందు కార్యరూపమై ఉన్నది ఆత్మ!
07. సమస్త జీవులందు చైతన్యముగనున్నది ఆత్మ!
08. మూడు ఆత్మలలో రెండవదైనది మధ్యాత్మ!
09. అఖిల జీవరాసులందు అన్ని పనులు చేయిస్తున్నది ఆత్మ!
10. సమస్త జీవరాసులందు చైతన్యరూపమై ఖండ ఖండములుగా శరీరములో వ్యాపించి ఉన్నది ఆత్మ!
11. సర్వ జీవరాసులందు నివశిస్తూ, ఆయా శరీర ఆకారము కల్గియున్నది ఆత్మ!
12. శరీరమను గుడిలో దీపమై శరీరమంతటికీ వెలుగు నిచ్చుచున్నది ఆత్మ!
13. సమస్త శరీరములలో జీవునితోపాటు ఉంటూ, ఆ శరీరమునకు శక్తినిచ్చుది ఆత్మ!
14. ముగ్గురు పురుషులలో అక్షర పురుషుడై శరీరములోనున్నది ఆత్మ!
15. ప్రతి శరీరములో జీవాత్మలకు సాక్షిగాయున్నది ఆత్మ!
16. ఇంద్రియములకు శక్తినొసగునది ఆత్మ!
17. కొలిమి మంటకు గాలితిత్తి, తిత్తిని కదిలించు కట్టె, కట్టెకు చివర కూర్చొని కదిలించుచున్న వ్యక్తి, ఎలాగ అనుసంధానమై ఉన్నారో, అలాగే శరీరములో ముక్కులలోని శ్వాసకు ఊపిరితిత్తులు, తిత్తులకు బ్రహ్మనాడి, నాడికి చివరలోవుండి అన్నిటినీ కదిలించునది ఆత్మ!
18. శరీరములో శ్వాసను నడిపించునది ఆత్మ!
19. సమస్త జీవులందు ఒకేపని చేయుచున్నది ఆత్మ!
20. రెండవ ఆత్మయై శరీరములో అన్ని పనులూ చేయుచున్నది ఆత్మ!

21. శరీరములో నివాసముంటున్న మూడు ఆత్మలలో అహర్నిశలు జీవున్ని కాచుకొనియుండునది, రెండవది ఆత్మ!
22. ముగ్గురు పురుషులలో మధ్యవాడై, పూజ్యుడైయున్నది ఆత్మ!
23. సమస్త సజీవ శరీరములందు నఖ, శిఖ పర్యంతమూ వ్యాపించి శరీరములోని అన్ని అవయవముల చేత పనులు చేయించుచున్నది ఆత్మ!
24. శరీరములోని జీవునికి సాక్షిగానున్నది ఆత్మ!
25. పూలహారములో ఆధారమై దాగియున్న దారమువలె శరీరములో కనిపించక శరీరములకంతటికీ ఆధారమైయున్నది ఆత్మ!
26. శరీరాంతర్గతములలో ఉండి జ్ఞానము చేత పొగడబడునది ఆత్మ!
27. సమస్త జీవ శరీరములలో మూడు గుణముల మధ్య సాక్షిగా యున్నది ఆత్మ!
28. అఖిల జీవులతో కూడియున్నది ఆత్మ!
29. సమస్త జీవరాసులయందు గల మూడు ఆత్మలలో మధ్యనున్నది ఆత్మ!
30. చిన్న చీమలలోనూ పెద్ద ఏనుగులోనూ ఒకే విధానము కల్గి కర్మను పాలించునది ఆత్మ!
31. శరీరములోని అన్ని భాగములకు శక్తి నిచ్చుచూ ఎవరికీ తెలియకుండా వున్నది ఆత్మ!
32. అందరి శరీరములలో ఎవరికీ తెలియకుండా నిదురలోనూ, మెలుకువలోనూ అందరియందూ పనిచేయుచున్నది ఆత్మ!
33. అద్వైతాది మహా మునులు శరీరములో ఉన్నది నేను ఒక్కడినేనని చెప్పుకొనుచుండినప్పటికీ ఆత్మ మాత్రము వేరుగాయుండి జీవుని

కర్మ ననుసరించి శరీరమును కదిలించుచూ, జరిగెడి ఏ కర్మకూ బాధ్యుడు కానిది ఆత్మ!

34. శరీరములో అణువణువునా వ్యాపించి విధిని అనుసరించి శక్తినిచ్చునది ఆత్మ!
35. శరీరములో బాహ్య ప్రపంచముతో సంబంధము పెట్టుకొని ఎల్లవేళలా పనిచేయుచున్నది ఆత్మ!
36. శరీరములో ఏమాత్రము నిద్రలేకుండా ఎల్లప్పుడూ మేల్కొని పనిచేయుచున్నది ఆత్మ!
37. ఒక్కొక్క శరీరములో ఒక్కొక్క ఆత్మగా, జీవాత్మకు తోడున్నది ఆత్మ!
38. శరీరాంతర్గతమై బాహ్య దృష్ఠికి కనిపించక, జీవాత్మలైన స్వాములు, మునులు కూడా నేనే ఆత్మనని తలపోయునట్లు చేసి తాను మాత్రము వేరుగానున్నది ఆత్మ!
39. జీవాత్మకు పరమాత్మకు మధ్యనగలది ఆత్మ!
40. చెట్టులో తేమ వ్యాపించినట్లు, శరీరములో శక్తిగా వ్యాపించి యున్నది ఆత్మ!
41. ఇనుముతో కలిసిన అగ్నికి కూడా కొలిమి దగ్గర సమ్మెట దెబ్బలు తప్పవన్నట్లు, జీవునితో చేరి శరీరమంతా వ్యాపించి అప్పుడప్పుడు ఆకలికి శక్తిహీనత చెందుచున్నది ఆత్మ!
42. శరీరములో బ్రహ్మనాడిని కేంద్రముగా చేసుకొని శరీరమంతా వ్యాపించియున్నది ఆత్మ!
43. జీవాత్మకు పెద్దవాడు, పరమాత్మకు చిన్నవాడయినది ఆత్మ!
44. సమస్త శరీరములలో నాశనమగు జీవాత్మతో కలిసి నివాసము చేయుచున్నా నాశనముకానిది ఆత్మ!
45. శరీరమందు మాత్రము శక్తిగయున్న రెండవది ఆత్మ!

www.thraithashakam.org

46. శరీరమందు కర్మానుసారము కదలికలిచ్చుచూ, కర్మానుసారము రోగములు కలుగజేయుచూ, వాటిని అనుభవింపజేయునది ఆత్మ!
47. శరీరములోని మూడు ఆత్మలలో మధ్య ఆత్మయై శరీరమును నడిపించు శక్తియున్నది ఆత్మ!
48. శరీరములో ఎవరూ గుర్తించలేని విధముగా శరీర ఆకృతిని పోలియుండునది ఆత్మ!
49. శరీరములోని బ్రహ్మనాడిని స్థావరముగ ఏర్పరచుకొని శరీర మంతటా నఖ శిఖ పర్యంతము వ్యాపించి శరీరాకృతిని పోలియున్నది ఆత్మ!
50. శరీరము లోపల జరుగు సమస్త కార్యములకు సాక్షియైయున్నది ఆత్మ!
51. అకాల మరణము పొందినవానికి శరీరము పోయినప్పటికీ అదే శరీరాకృతి కల్గి, సూక్ష్మముగా కనిపించక వాని కర్మానుసారము ఆడించునది ఆత్మ!
52. మరణముండి నాశనము లేనిది ఆత్మ!
53. ఆకాశముననున్న సూర్యుడొక్కడే ప్రపంచమంతటినీ తన వెలుగుచే ప్రకాశింపజేసినట్లు, బ్రహ్మనాడియందుండి శరీరమంతటా చైతన్యముగా వ్యాపించియున్నది ఆత్మ!
54. శరీర గృహములో యజమానియైనది ఆత్మ!
55. హృది మధ్యలో నివాసముజేయుచూ సూత్రధారియైయుండి జీవుని పాత్రదారునిగా ఆడించునది ఆత్మ!
56. సమస్త జీవులందు ఏకకార్య స్వరూపుడయినది ఆత్మ!
57. పురుషులందు రెండవ వాడయిన అక్షర పురుషుడు ఆత్మ!
58. సమస్త జీవులందు కదలిక శక్తినిచ్చునది ఆత్మ!

www.thraithashakam.org

59. ముందు తానుండి  తన వెనుక జీవున్ని పెట్టుకొనినది ఆత్మ!
60. పరమాత్మ ప్రక్కనుంచుకొని జీవునితో కలిసియుండి శరీరముతో పనులు చేయునది ఆత్మ!
61. అన్ని జీవులందు వేరువేరుగా కలిసియున్నది ఆత్మ!
62. శరీరము వెలుపల ఏమాత్రము లేక లోపల మాత్రము చైతన్యముగానున్నది ఆత్మ!
63. అఖిల జీవులందు కలిసియున్నది ఆత్మ!
64. మూడు గుణములకు వేరుగ వున్నది ఆత్మ!
65. జీవుల ప్రక్కనేనున్నది ఆత్మ!
66. కాగిన ఇనుములో అగ్నియున్నట్లు, సమస్త జీవుల శరీరములందు ఇమిడియున్నది ఆత్మ!
67. సూర్యుడొక్కడు ఈ లోకమును ప్రకాశింపజేయునట్లు, శరీరమంతటినీ తానొక్కడే ప్రకాశింపజేయునది ఆత్మ!
68. నాశరహితుడై నాశనముకాగల జీవాత్మతో కూడివున్నది ఆత్మ!
69. పూసల మధ్యలో దారమున్నట్లు, జీవుల శరీర మధ్యలో శరీరమంతటికీ ఆధారమైయున్నది ఆత్మ!
70. ఎడతెరిపి లేకుండా ఎల్లకాలములందు జీవునితో కలిసియున్నది ఆత్మ!
71. చర ప్రకృతియైన శరీరమంతటా వ్యాపించియున్నది ఆత్మ!
72. పంచభూత నిర్మాణమైన శరీరమునకు ఆధారముగనున్నది ఆత్మ!
73. పరమాత్మయూకాక, జీవాత్మయూకాక కేవలము ఆత్మయై జీవాత్మతో పాటు శరీరములోనున్నది ఆత్మ!
74. మొదటిదయిన జీవాత్మకు, మూడవదయిన పరమాత్మకు మధ్య సంధానమైయున్న రెండవది ఆత్మ!

www.thraithashakam.org

75. కాగిన ఇనుములో ఇనుమంతయూ అగ్ని వ్యాపించి యున్నట్లు, శరీరమంతా వ్యాపించియున్నది ఆత్మ!

76. పరమాత్మ పాలించు విశ్వమను సామ్రాజ్యములో శరీరమను సామంత రాజ్యమునకు రాజయినది ఆత్మ!

77. ప్రపంచమంతటికీ గల ముగ్గురు పురుషులలోనూ మధ్య పురుషుడుయై అక్షర పురుషుడని పేరుగాంచి, క్షరపురుషునివద్ద నిలచినది ఆత్మ!

78. శరీరములో సకలేంద్రియములకు శక్తినిచ్చునది ఆత్మ!

79. బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములకు ఇరుసుగ నున్నది ఆత్మ!

80. జ్ఞానులయందునూ, అజ్ఞానులయందునూ, మూర్ఖులయందునూ, తెలివైన వారియందునూ, మంచివారియందునూ, చెడువారి యందునూ, అన్ని మతములవారియందునూ ఒకే పద్ధతి కల్గి, ఒకే విధముగా రాగము (ప్రేమ) గానీ, ద్వేషముగానీ లేకుండా వర్తించునది ఆత్మ!

81. పురుషాకృతియైన ఈశ్వరలింగము మీద ముగ్గురు పురుషుల గుర్తుగయున్న మూడు విభూతి రేఖలలో మధ్య రేఖగా గుర్తింపబడి యున్నది ఆత్మ!

82. శరీరములోనే దృష్టినిల్పి దేవుని తెలియవలెనని ప్రయత్నించు యోగులకు తెలియబడు రెండవది ఆత్మ!

83. పూలమాలకు ఆధారమైన దారమువలె, శరీరమునకు ఆధారమై యున్నది ఆత్మ!

84. సకల శరీరములందు మూడవస్థలలో చైతన్యమునిచ్చునది ఆత్మ!

85. పాపము చేయునపుడు, పుణ్యము చేయునపుడు ఒకే విధముగా శరీరమునకు శక్తినిచ్చి, ఏ కర్మ అంటకుండా ఉండునది ఆత్మ!

www.thraithashakam.org

86. భువిలో ఎన్ని జీవరాసులున్నాయో అన్నిటిలోనూ అన్ని ఆత్మలుగా విభజించబడి, పరమాత్మ ప్రతినిధిగా ప్రకృతిలో కలిసి శరీరములో పనిచేయుచున్నది ఆత్మ!
87. ఏ విషయముతో సంబంధము లేకుండా శరీరములోని కర్మ ప్రకారము శరీరమును నడిపించునది ఆత్మ!
88. శరీరములోని బ్రహ్మనాడి యొక్క ఏడు ద్వారముల ద్వారా మరియు గ్రంథుల యొక్క ఏడు ద్వారముల ద్వారా శరీరమును పాలించునది ఆత్మ!
89. సమస్త జీవరాశుల బుద్ధికి సమానముగా అర్థమగునది ఆత్మ!
90. అయమాత్మ బ్రహ్మమని సమస్తయోగుల చేత ఉచ్ఛరించబడునది ఆత్మ!
91. జాగ్రత్త, స్వప్న, నిద్రయనబడు మూడవస్థలకు సాక్షిగనున్నది ఆత్మ!
92. మూడు ఆత్మలయందు మధ్య ఆత్మయై, సమస్త యోగులచే ఆరాధింపబడునది ఆత్మ!
93. శరీరములోని 25 భాగములకు అతీతముగాయుండి, శరీరమంతటికీ శక్తినొసగునది ఆత్మ!
94. పరమాత్మకంటే తక్కువవాడై, జీవాత్మకంటే ఎక్కువ వాడైయున్నది ఆత్మ!
95. ఇంటిలో విద్యుచ్ఛక్తిలాగా, శరీరములో చైతన్య శక్తియైయున్నది ఆత్మ!
96. యోగులయందునూ, భోగులయందునూ సమాన వృత్తి కలిగి యున్నది ఆత్మ!

www.thraithashakam.org

97. శరీరములో అణువణువునా వ్యాపించి శరీరాంతర్గత పనులకు కారణశక్తియై యున్నది ఆత్మ!

98. అండజ, పిండజ, ఉద్భిజములైన మూడు రకముల జీవరాశులలో ఏ జీవరాశియందైనాగానీ, ఒకే సిద్ధాంతము, ఒకే నిర్ణయముగా, ఒకే పద్ధతిగా పనిచేయునది ఆత్మ!

99. జీవాత్మ ఏ శరీరములో ప్రవేశించినా, దానివెంట ఆ శరీరములో ప్రవేశించి అక్కడ కర్మరీత్యా ఏమి జరుగవలెనో, ఆ పనులను శరీరము ద్వార చేయించునది ఆత్మ!

100. శరీరములో పని తాను చేసి ఫలితమును జీవాత్మకు అందించేది ఆత్మ!

101. శరీరములోని ప్రాణమునకు ఆధారమై ఆడించుచున్నది ఆత్మ!

102. నేను పుట్టినప్పటినుండి నాలో అన్ని పనులకు సాక్షిగయుంటూ ప్రారబ్ధమును నాచేత అనుభవింపజేయునది ఆత్మ!

103. శరీరమనెడి రథమునకు సారథిగయుండి, ఇంద్రియములనెడి గుఱ్ఱములను త్రోలు సారథియై, శరీర రథమును అధిష్ఠించి యున్న జీవునికి సుఖదు:ఖములనెడి అనేక ప్రదేశములను చూపుచున్నది ఆత్మ!

104. చెట్టుకు తాట అనుబంధమై ఉన్నట్లు, శరీరములోని జీవాత్మకు శక్తి రూపములో అనుబంధమైయున్నది ఆత్మ!

105. సంసారమను నాటకమునకు పరమాత్మ సూత్రధారికాగా, నాటకమును వీక్షించుచూ నాటకములోని భావములను అనుభవించు ప్రేక్షకుడు జీవుడుకాగా, నాటకమును ఆడునది ఆత్మ!

106. శరీరములో ఆత్మ చేస్తున్నప్పటికీ జీవాత్మ తాను చేసినట్లు తలచితే, ఆ పనిలోని కర్మను జీవునికి అంటగట్టునది ఆత్మ!

www.thraithashakam.org

107. శరీరములో ప్రారబ్ధకర్మ ప్రకారము సుఖదు:ఖములను ఆడించుచూ, అహము పొందిన జీవాత్మ పాలిట చిత్రగుప్తుడుయై, ఆగామికర్మను అంటగట్టునది ఆత్మ!
108. మంచి చెడు కర్మలను తారతమ్యము లేకుండా ఆచరించుచూ, పాపపుణ్యములకు సంబంధము లేనిది ఆత్మ!
109. అజ్ఞానులలో ప్రారబ్ధమును అనుభవింపజేయుచూ ఆగామికర్మను అంటగట్టుచూ, జ్ఞానము తెలిసిన యోగులలో ప్రారబ్ధమును అనుభవింపజేయుచూ, ఆగామికర్మను అంతము చేయుచున్నది ఆత్మ!
110. శరీర యంత్రాంగములో 24 భాగములను ఒక్క జీవుని కొరకు నడిపిస్తూ పరమాత్మకు బంటుగ నిలిచినది ఆత్మ!
111. శరీరములో ఆత్మ ఏమి చేయుచున్నది ఎవరికీ తెలియనీయకుండా నిద్రించు సమయములో కూడా శ్వాసను నడుపుచున్నది. అటువంటి ఆత్మ ఉనికిని తెలియక అన్ని నేనే చేయుచున్నానని జీవుడు భ్రమిస్తున్నప్పటికీ ఏ పనినీ జీవునికి వదలక అన్ని పనులనూ ఎంతో ఓర్పుగా చేయుచున్నది ఆత్మ!
112. శరీరములో తప్ప బయట ఎక్కడా ఏ వస్తువందూ లేనిది ఆత్మ!
113. శరీరములో బుద్ధికి తెలియని విద్యలయిన, జంతువు చిన్నతనము లోనే నీటిలో ఈదడమును, దూడ పాలపొదుగును గుర్తించడమును, ఐదు సంవత్సరముల చిన్నవయసు మనిషికి పాండిత్యము కలుగడము మొదలగు వాటిని తెలియజేయుచూ ఏమీ తెలియని దానివలెనున్నది ఆత్మ!
114. జీవుడు ధరించిన శరీరము ఎంత పరిమాణముండునో అంతే లావు, అంతే ఎత్తు కల్గి ఆ శరీర ఆకృతిని కల్గియున్నది ఆత్మ!
115. శరీరములో అంతటా వ్యాపించియుండి, కర్మవుంటే చేతిలోనో,

కాలిలోనో శక్తి లేకుండా చేసి, అవిటివానిగా కనిపింపజేయుచూ జీవునికి కర్మను అనుభవింపజేయునది ఆత్మ!

116. శరీరములో ప్రారబ్ధకర్మను జీవుని చేత అనుభవింపజేయు యమధర్మరాజుయై, అహముగల వానికి ఆగామికర్మను తలకు ఎక్కించడములో చిత్రగుప్తుడుయై చలామణి అగునది ఆత్మ!

117. మరణములోనూ, పుట్టుకలోనూ జీవునివెంట వుండి మరణము నుండి పుట్టుక వరకు గుణములనూ, జీవుని కర్మ సముదాయమునూ తీసుకువస్తున్నది ఆత్మ!

118. శరీరములో అన్ని పనులు చేయుచూ, ఏ ఒక్క పనిని కూడా నేను చేశానని బయటికి తెలుపక, ఎన్నో విజ్ఞాన పరికరములను కనిపెట్టించు యోచనను ఇచ్చినప్పటికీ ఏమీ తెలియని జీవుడు నేను కనిపెట్టానని చెప్పుకొనుచున్నప్పటకీ ఊరక చూస్తుండినది ఆత్మ!

119. చావులోనూ, పుట్టుకలోనూ సాక్షీభూతుడుయై ఆ సమయములో ఏమి జరుగుచున్నదో ఎవరికీ తెలియని రహస్యమును తెలిసినది ఆత్మ!

120. చెట్టులో చెట్టు ఆకృతిని పోలియుండి, జంతువులో జంతువు ఆకృతిని పోలియుండి, మనిషిలో మనిషి ఆకృతిని పోలియుండి అనేక శరీరములలో ఆ శరీరములవలె అనేక ఆకారములు కల్గియున్నది ఆత్మ!



**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు, సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

www.thraithashakam.org

# లిపి

## అంటే ఏమిటి?

# తెలుగు

త్రిమత ఏకైక గురువు

శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

www.thraithashakam.org